# శ్రీ రామకథా సుధ



వారణాశి సూర్యకుమారి


# శ్రీ రామకథా సుధ


( పద్యకావ్యం )




వారణాశి సూర్యకుమారి

with best wishes. [illegible] V. S. Kumari

# శ్రీరామ కథా సుధ

(పద్యకావ్యం)



రచయిత్రి

## వారణాసి సూర్యకుమారి




సాహితీ మిత్రులు

మచిలీపట్నం






**శ్రీరామ కథా సుధ**

(పద్యకావ్యం)

రచన :
వారణాసి సూర్యకుమారి

ప్రథమ ముద్రణ :
ఆగష్టు 2004

అమూల్యం

రచయిత్రివే

D.T.P.
BANDAR KALYANI PRESS
MACHILIPATNAM - 1



## అంకితము

అఖిల జనులకు ఆరాధ్య దైవము

అయోధ్యారాముని

అరుణ చరణారవిందములకు

అత్యంత భక్తితో

అర్పణం

- వారణాసి సూర్యకుమారి



సీ. నిస్వార్థ బుద్ధిని నిర్మల భక్తిని
నీతి నియమములన్ నిల్పు నెవరు
సుస్థిర చిత్తమున్ శుభ సంకల్పమున్
కోరి చేయు పరోపకారి యెవరు
సేవా తత్పరులును స్నేహ బాంధవులును
సాధు శీలియు సత్య సంధులెవరు
త్యాగము ధైర్యము తన నైజ గుణములన్
బిడ్డల పెంచిన దొడ్డ యెవరు

తే. గీ. వారణాసి వంగడమున వాసికెక్కు
వారు లక్ష్మీ జయప్రదన్ గారు । నాదు
భాగ్యమే వారు లభియింప భర్త గాను
వారి యాశీస్సు లెపుడు నే కోరుచుందు ॥

- వారణాసి సూర్యకుమారి



# ఆశీః!

'అనంతావైవేదాః' అన్నారు. భరద్వాజుడు మూడు వందల సంవత్సరాలు చర్యం పాటించి వేదాధ్యయనం చేశాడు. అతనికి యింకా చదువుకొని వేదాలు పూర్తి యాలనే ఆసక్తి కలిగింది. ఇంద్రుడు 'నీకు నాల్గవ వంద ఆయుర్దాయం యిస్తాను. ఏమి త్తావు ? అని ప్రశ్నించగా వేదాలు చదువు కొంటాను అన్నాడట. అప్పుడింద్రుడు వేదం తమైతే నీవు గ్రహించింది గుప్పెడు. వాటికి పూర్తి అనేది లేదు అన్నాడట.

రామాయణాలు ఎన్ని వున్నాయో, ఎన్నెన్ని విషయాలు ఎందరిచేత యబడ్డాయో ఊహకందని విషయం. రామకథను, రామనామ మహిమను ఎందరు ఎన్ని లుగా వర్ణించినా పూర్తిగా వర్ణించినట్లు కాదు. సముద్రం వద్దకు వెళ్ళినా మన వద్ద ఎంత త్ర వుంటే అంత మాత్రం నీరు తెచ్చుకోగలం. మన పాత్రను బట్టి రామాయణ క్షీరసాగరం ండి అమృతాన్ని గ్రోలగలం.

వేదాలు అపౌరుషేయాలు బ్రహ్మముఖతః వెలువడ్డాయి. నిషాదుని చర్యకు షాదంతో అయత్నకృతంగా వాల్మీకి ముఖతః వెలువడిన శ్లోకం శోకమై రామాయణ సుధకు నాంది అయ్యింది.

శ్రీమతి వారణాసి సూర్యకుమారి వ్రాసిన 'శ్రీరామకథాసుధ' స్థాళీపులాక యంగా చదివాను. రామాయణాన్ని నిర్వచనంగా వ్రాయాలన్న ఆమె సంకల్పానికి ఆమెను, త్సహించిన కుటుంబ సభ్యులను అభినందిస్తున్నాను.

బాలకాండలో 'పుంసాంమోహనరూపాయ' అయిన రాముని రూప వర్ణన దంగా వుంది. సుందరకాండలో సీత హనుమంతునితో 'మనజాల నాధునే మనగజాల' టూ, 'వేగరాకున్న నేనిక వేగలేను' అని కబురు పంపుతుంది. రావణుని సభకు తీసికొని బడ్డ ఆంజనేయునకు ఆ వైభవం చూశాక 'పరదారలను గోరు పాడు బుద్ధి యొకటె' సముగా తోచింది. దశకంఠుని తలలను జూచి 'ఒక్క తలయైన చెప్పదే యొక్కమాట, వలె పరస్త్రీలను తలపమంచు' అనుకున్నాడు అనడం ఆకట్టుకున్నది పద్యాల ధార, కథా విధానము, అటనట అలంకాలములతో రచనసాఫీగా సాగింది.

ఈ కవయిత్రికి చిన్నప్పుడు తెలుగు పాఠాలు చెప్పిన ఉపాధ్యాయునిగా ఆనంద లో తేలియాడాను. అలతి యలతి పదాలతో కవిత లలిత పదకలితంగా సరసభావ తంగా వుంది. ఆమెకు ఆమె కుటుంబ సభ్యులకు 'శ్రీరామరక్ష' కలుగుగాత ! అని ర్వదిస్తున్నాను.

ద్రాక్షారామం

వాడపల్లి మృత్యుంజయ సోమయాజులు

# నమస్సుమనస్సులు

మచిలీపట్నం సాహితీ మిత్రుల సంస్థ గత 24 సంవత్సరాలుగా నిర్విరామంగా సాహిత్య కృషి కొనసాగించ గలుగుతున్నదంటే దానికి ఎందరెందరో మహానుభావుల ఆత్మీయానురాగాలే కారణం. ఎందరో కవులు, రచయితలు మాకు సహకారాన్ని అందిస్తున్నారు. మరెందరో సాహితీ ప్రియులు, వదాన్యులు, మిత్రులు మా సంస్థకు వెన్నెముకగా నిలిచి ఉన్నారు. వచ్చే జనవరిలో మా సంస్థ రజతోత్సవ కార్యక్రమాలు ప్రారంభించుకొనబోతున్నామని తెలియ జేయటానికి సంతోషిస్తున్నాము.

శ్రీమతి వారణాసి సూర్యకుమారి గారు రచించిన భక్తి సర పద్య కావ్యం **శ్రీ రామ కథా సుధ** వెలువరిస్తున్న శుభ సందర్భంలో వారికి మా అభినందనలు.

సూర్యకుమారి గారు షష్టిపూర్తి వయస్సులో వారి మొట్ట మొదటి కావ్యం ప్రచురిస్తున్నారు. కవిత్వం రాయటానికి వయసుతో ప్రమేయం లేదని, ఉత్సాహం, సాహిత్యాభిమానం ఉంటే ఎప్పుడైనా కవిత్వం రాయవచ్చుననే స్ఫూర్తిని అందజేస్తున్నారు. సాహితీ మిత్రుల ప్రచురణగా ఈ గ్రంథాన్ని వెలువరిస్తున్నందుకు వారికి, వారి కుటుంబ సభ్యులకు ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేసుకుటున్నాము.

| | |
|---|---|
| సాహితీ మిత్రులు | డా॥ **రావి రంగారావు** |
| మచిలీపట్నం | వ్యవస్థాపక అధ్యక్షులు |



# ప్రేరణ-పూరణ

"శ్రీరామ" అని ముందు వ్రాసి తర్వాత ఏదైనా రాయడం 'శ్రీరామ శ్శరణంమమ'' అనుకుని ఏ పనైనా చేయడం నాకు బాగా అలవాటైంది. అప్పటినుంచి మాకు 'శ్రీరామ రక్ష' లభిస్తూంది అని నా నమ్మకం.

2000 సంవత్సరం జనవరి నెలలో నేను యు.ఎస్.ఎ.లో ఉన్నాను. మంచు ముత్యాల జల్లులా కురుస్తోంది. చుట్టు ప్రక్కల ఎటుచూసినా హిమరాసురే. ఇండ్లు, చెట్లు, చివరికి పార్కు చేసి ఉంచిన కార్లు సైతం మంచు ముసుగులో కనిపిస్తూ ఆహ్లాదకరమైన వాతావరణం మనసున కనిర్వచనీయమైన అనుభూతిని కల్గించింది. ప్రకృతిలోని చిత్రాలు అన్నీ భగవంతుని సృష్టియే కదా ! అనిపించి ఆధ్యాత్మిక భావనతో పారవశ్యం చెందాను.

నా మనుమడు చి॥ జయవంశీ చిన్నారి చిలిపి చేష్టలతో కొంత సమయము ఉల్లాసంగా గడచినా ఆఫీసులకి వెళ్లిన అబ్బాయి, కోడలూ యింటికి వచ్చేదాకా షుమారు 8-9 గంటల కాలం ఉదాసీనంగా గడపడం యిష్టం లేక ఈ 'మిలీనియమ్'లో ఏదైనా ఒక మంచి పని చేయాలనిపించింది. ఏమి చెయ్యడమా అని ఆలోచించి చివరికి నా పదహారోఏట నుండీ అలవాటైన 'రచన'నే ప్రతిష్ఠాత్మకంగా రూపొందించే ప్రయత్నం చేయాలనిపించింది. నాయిష్టదైవమైన 'శ్రీరామ చంద్ర'మూర్తి చరితమునే పద్యరూపంలో రాస్తే బాగుంటుంది. నాకున్న బోలెడు ఖాళీ సమయం సద్వినియోగం ఔతుంది అనుకున్నాను.

ఆనాటి నుండి 'శ్రీరామ కథా సుధ' వ్రాయండ మొదలు పెట్టాను. 'శ్రీరామ నవమి' నాటకి పూర్తి చేసి శ్రీరాముని పాద సన్నిధిని సమర్పించాను. నా 60వ యేట ఈ 'బృహత్కార్యము' నెరవేర్పచేసినట్టి ఆ శ్రీరామ చంద్రమూర్తికి సర్వదా కృతజ్ఞురాలను.

ఆ ఇంగ్లీషు భాషా ప్రదేశంలో నా అదృష్టము కొద్దీ మా అబ్బాయి ఉన్న ఇలినేయిస్టేట్‌లో 'అర్బానా' అనే చోట పెద్ద యూనివర్సిటీ లైబ్రరీ ఉంది. అక్కడ నుంచి తెలుగు నిఘంటువు, ఉషశ్రీ గారి రామాయణం, ఇంకా బోలెడు పుస్తకాలు తెచ్చియిచ్చి రాయడానికి నన్ను ప్రోత్సహించారు మా అబ్బాయి, అతని స్నేహితుడు సుధాకర్‌గారు. వారికి నా శుభాశ్శీసులు.

మా పెద్దబ్బాయి చి॥డా॥ పినాకపాణి బీహారులోను చిన్నబ్బాయి చి॥డా॥ చక్రపాణి యు.ఎస్.ఎ.లోను షుమారు 15 సంవత్సరాలుగా ఉండటంతో తెలుగు భాషకు దూరమవుతున్నామని బాధపడుతూ సులభశైలిలో వాడుక భాషలో తేలికైన, తీయనైన తెలుగు వ్రాయవలసినదని కూడా అనడంతో నేను ధైర్యం చేయగల్గాను. ఎన్నిసార్లు చదివినా ఎన్నిసార్లు విన్నా ఎన్నిసార్లు దృశ్యకావ్యంగా చూసినా కూడా నిత్యనూతనంగా ఉంటూ ఆసక్తిని, భక్తిని పెంచే 'శ్రీమద్రామాయణ'ము రచించ బూనుట నా పూర్వ జన్మ పుణ్యఫలమని భావిస్తాను.

'శ్రీరామకథాసుధ'ను నాకు చేతనైన రీతిలో శాయశక్తులా కృషిచేసి తయారు చేసాను
ఇది అందరికీ పంచాలని కూడా ఆశపడుతున్నాను.

నా జ్యేష్ట సోదరుడు చి॥ నెహ్రూ కూడా ఆ సమయంలో 'అట్లాంటా'లో ఉండడం వల్ల నా సంకల్పం చెప్పి, వ్రాసిన 1,2 పద్యాలు ఫోనులోనే వినిపించాను. వెంటనే అతడు "అక్కా వ్రాస్తున్నావా! చక్కగ రామాయణమును" అంటూ ఆశువుగ 'కందం' చెప్పి 'నిక్కపు భక్తిని గొలువగ నిష్ఫలమగునే' అన్నాడు. వానికి కూడా నా శుభాశీస్సులు.

తేటగీతులే కాదు వృత్తాలు కూడా ప్రయత్నించమని సలహా చెప్పిన చి॥డా॥ వెంకట రమణకు, మంచిపనికి పూనుకున్నారు అంటూ మనస్ఫూర్తిగా సమర్థించిన చి॥డా॥ ప్రసాద్ వీరిద్దరూ జామాతలే గాని నాకు స్ఫూర్తి దాతలనవచ్చు. వారికీ నా శుభాశీస్సులు.

అమెరికాలో పూర్తి చేసి ఇండియా వచ్చి అచ్చు వేయించడాన్కి ధైర్యం చాలలేదు. అప్పుడు ఆపద్భాంధవునిలా డా॥ రావి రంగారావు గారు ఆదుకొన్నారు. ఓపికగా అంతా చదివి అవసరమైన మార్పులు చేర్పులు చేయమని చాలా సలహాలనిచ్చి నా 'రచన' వెలుగు చూడడానికి చాలా సహకరించారు. 2000-2004 వరకు చాలాసార్లు తిరిగి రాస్తూ తిరిగి చదువుతూ నాకు సంతృప్తిగా అనిపించే వరకు కాలం గడిపి మరలా తీసికెళ్ళి చూపించాక గురుతుల్యులు రంగారావు గారు బాగున్నాయి అన్నారు. ఆయనకు నా దన్యవాదములు. మా గురువరేణ్యులు శ్రీ వాడపల్లి మృత్యుంజయ సోమయాజులు గారు ఛందస్సు మాకు భోదించిన విధానము వల్లనే నాకు 'తెలుగు పద్యాలు' వ్రాయాలనే ఆసక్తి విద్యార్థి దశలోనే కల్గిందనుటలో అతిశయోక్తి లేదు. వయోవృద్ధులయ్యుండి కూడా శ్రమ తీసుకుని నా రచనలోని పొరబాట్లను సరిదిద్ది తమ ఆశీస్సులందించిన మా మాష్టారు గార్కి నా హృదయ పూర్వక ప్రణామములు.

పుస్తకము ముద్రించుటలో కూడా చాలా శ్రద్ధ వహించి, ముఖచిత్రము, లోపలిపేజీలు ఆకర్షణీయంగా ముద్రించి, నాకంటె ఎక్కువ శ్రమపడిన అందరికీ కృతజ్ఞతలు.

సత్కాలక్షేపం చేస్తున్నావంటూ ప్రశంసించినవారి వల్ల ప్రోత్సాహం, ఎప్పుడూ రాసుకుంటూ కూర్చుంటుంది అని విమర్శించే వాళ్ళ వల్ల పట్టుదల పెరిగి ' శ్రీరామ కథా సుధ'ను పూర్తి చేయగల్గాను.

**'శ్రీరామ కథాసుద' గ్రోలి చదువరులు ఆనందించగల్గినచో నా శ్రమకు తగిన ఫలితము లభించినట్లే.**

## సర్వులకూ శ్రీరామ రక్ష సిద్ధించుగాక



# శ్రీ విఘ్నేశ్వర ప్రార్థన

తే.గీ. వందనమిదె గజానన। అందుకొనుము
బుద్ధినిచ్చి సత్సంకల్ప సిద్ధినిచ్చు
గురుడు దైవము సకలమ్ము గూర్చి నీవు
సుకవి వంద్యుడ చల్లగా చూడు మమ్ము ॥



గణపతివి మాకధిపతివై కనవె మమ్ము
ఆది నిను గొల్చి తీరెద రమరులైన
జగతి నేలెడి జగదంబ చంకనెక్కి
సుద్దులాడుచు చల్లగా చూడుమమ్ము ॥

శీఘ్రగతి భూ ప్రదక్షిణ సేయు వేళ
తల్లి దండ్రుల చుట్టు ప్రదక్షిణంపు
యుక్తి చూపిన ఘనుడవు ముక్తి దారి
చూపి తరియించ చల్లగా చూడుమమ్ము

మ. సురలోకార్చిత విశ్వమంతయు నుతించు న్నీమహత్త్యంబునే
తరమా మాకు వినాయకా మదిని నీ ధ్యానంబు నే జేయగన్
కరుణింపందగు నయ్య నమ్మినను మా కత్యంత సౌఖ్యంబుగా
కురిపించంగ కృపారసమ్ము నిలపై కూర్చందగున్ సంపదల్ ॥

మ. గణనాధా వర మయ్యె వారలకు లోకారాధ్య యా పాము భూ
షణమై యొప్పచు ఔర యా గజము నాస్యంబయ్యె సేవించగా
ఫణమే మిచ్చెను భక్తి యర్పణము తప్పన్ స్వామి। విఘ్నేశ్వరా
తృణమైనన్ ప్రియ మారగైకొను సదా తృప్తి న్మదీయార్చనన్ ॥

# సరస్వతీ ప్రార్థన



కం. చల్లని చూపుల చదువుల
తల్లీ ! భారతి । నిరతము తలతును నిన్నున్
కొల్లగ రామకథాసుధ
నుల్లము రంజిల్ల వ్రాయ నుడువుము పదముల్ ॥

నమ్మితి మదిలో భగవతి
కమ్మగ చెప్పగ కవితను కరుణను గనవే
ఇమ్మి రచనను వరముగ
నమ్మా ! రాము దయనెల్ల రామోదించన్ ॥

వారిజ భవుడును శివుడును
వారిజ నాభుడు భజింత్రు వరుసగ నిన్నున్
వారికి, నేరికి మూలము
వారిజనేత్రీ । నిజముగ । వాణీ । నీవే ॥

తే. గీ. సతత పుస్తక ధారిణి, సత్యవాణి
సకల లోక సేవిత సరస్వతివి మాత
నమ్మిగొల్తు వీణాపాణి నలువరాణి
నీ యనుగ్రహమ్మును మాకు నీయవమ్మ ॥

తే. గీ. మిన్నయైనట్టి రచనలు యెన్నగాను
వ్రాయ నేర్పుము వాగ్దేవి వాసి గాంచ
జనని పదముల తేనెలు జాలువార
కృతి సమర్పణ నే చేసుకొనెద నీకు ॥



# శ్రీరామ స్తుతి



తే. గీ. రామ । శ్రీరామ । వినగ నీ నామ మెంత
మధుర మనిపించు కురిపించు సుధలవాన
నీదు సుందర వదనంబు నీరజాక్ష
కనగ జన్మము చరితార్థ మనగ జెల్లు ॥

దాశరథి నినుగని తల్లి దండ్రి, పెంచి
కైక సేవించి సోదరుల్ కరము పట్టి
జానకి తనయ నిచ్చిన జనక రాజు
దంపతులు గురువులు కూడ ధన్యులైరి

కోటి ఫలము లొందగ రామ కోటి వ్రాసి
పుణ్యరాశి పొందిన యగ్ర గణ్య కోటి
నిలను గంటి నబలను నే నేమి జేసి
మోక్ష మొందుదు రఘురామ? రక్ష నీవె ॥

దాన ధర్మములకు లెక్క దానగాను
సేవలను చేయ ప్రాణావశేషనేను
హనుమ రీతిని భక్తితో నినుగొలువగ
శక్యమే ? నీదు స్మరణమే శరణు నాకు ॥

సత్య సంధత చాటిన సత్యమూర్తి
త్యాగ నిరతిని నిలిపిన త్యాగమూర్తి
ధర్మ రక్షణ జేసిన ధర్మమూర్తి
చల్లగా చూడు శ్రీరామ చంద్రమూర్తి ॥

# కవి పరిచయం



తే.గీ. భాగ్యవశమున । పుట్టితి । భాగవతిని
వరమనంగను । మెట్టితి । వారణాసి
వంశమందున । దైవమే । వారనదగు
పతిని । బొంద । యెంతో పుణ్యవతిని నేను ॥

మజ్జనని సత్యవతి సాధ్వి మజ్జనకులు
శుద్ధ దేశ భక్తిపరులు సుబ్బరావు
గారు నెహ్రు, బోసు,తిలక్కు వారు తమ్మ
లుత్తములు చాల సౌమ్యులు చిత్తమందు ॥

తగిన భార్యలు సంతతి తనరు చుండి
అక్కనుంజూచు చుందురు ఆదరముగ
ఆయురారోగ్య సుశ్రీల నందజేయ
వేడుకొందు రాముని యన్నివేళలందు ॥

అత్తగారునుత్తమురాలు అమ్మవోలె
ఆదరించెడు కామేశ్వరమ్మ గారు
లక్ష్మి నరసింహముంగారు లక్షణమగు
వ్యక్తి మా మామగారన్న భక్తి మాకు ॥

సంతు ఘనతను గని వారు సంతసించి
దివిని నాశీస్సులిడు మాకు దివ్యముగను
వారికాత్మ శాంతి లభింపకోరి రాము
వేడుకొందును నేనన్ని వేళలందు ॥



జనని జనకులు దైవము జన్మభూమి
యన్న భక్తిశ్రద్ధ ప్రేమలున్న వారు
భార్య బిడ్డలందనురాగ మధికమన్న
వారు లక్ష్మీ జయప్రదన్ గారు విభులు ॥

తే.గీ. కొమరులు పినాక పాణియును మరి చక్ర
పాణి । శోభ శైలజయునా బరగు కొమరి
తలును రమ,వాణి ఆదరమ్ములను బడయ
రాము డిచ్చిన వరమను నా మనంబు

శోభకు వరమగున్ ప్రసాద్ ప్రాభవమ్ము
శైలజకు రమణయు పుణ్య సత్ఫలమ్ము,
అప్పినాక పాణికి లక్ష్మి యనుగుణమ్ము
చక్రపాణికి శ్రీదేవి చాల సొమ్ము ॥

మనుమలు జయవంశి వరుణ్‌లు మనుమరాండ్రు
నీలు, వర్షమనూహర్షి ణీలు రామ
రక్ష నా చిరంజీవులు రాజిలంగ
వేడుకొందు రాముని యన్ని వేళలందు ॥

ఉ. కొద్దిగ వ్రాసినన్ మిగుల గొప్పగ జెప్పుచు నన్ను చక్కగా
దిద్దుచు తీర్చినట్టి పతిదేవులు లక్ష్మిజ యప్రదన్ సదా
అద్దివి శాంతి బొందగను అక్షర లక్షల వేడుకొందునే
పద్దియముల్ రచించుచును భక్తిగ రాముని మెప్పు కోరెదన్ ॥

తే.గీ. వాసిగాంచంగ రచనలు వ్రాయుమనుచు
స్ఫూర్తినిచ్చి మెచ్చుచు మనస్ఫూర్తిగాను
కోరి పొగడుచు తెలిపెడు యేరికైన
అట్టి పతిదేవునకు నేను అంజలింతు ॥





# బాలకాండ

1. సీ॥ శ్రీమహావిష్ణువు శ్రీలక్ష్మితో గూడి
వైకుంఠమందున వాసముండు
విశ్వ కల్యాణము విధిగ వెన్నుడు జూడ
జనులంత హాయిగ జగతి నుంౘ్రు
హరికీర్త నమ్మున హరి సేవయందున
పావనులై ప్రజల్ ప్రబలుచుంౘ్రు
నెఱనమ్మి సేవించ నెవరైన ఐహికా
ముష్మికా నందముల్ బూనియుండు

తే॥ గీ॥ భాగవతులు పూజించగ భక్తితోను
బాధలన్నియు తొలగును భాగ్యమొందు
సకల ప్రాణులు హరికిని సములు భువిని
అవతరించును మొరలను ఆలకించి

2. కనగ దైవమెందైనను గలడు అనగ
మత్స్య కూర్మ వరాహమై మరియు నుగ్ర
నారసింహుండునై వామనావ తారు
డై తదుపరి పరశురాము డవతరించె

3. సీ॥ మహిత వేదమ్ముల మత్స్యమై బ్రోవంగ
దైత్యుని దునిమిన దైవమె హరి
పాల్కడలి మథియింపంగను కూర్మమై
మంథరన్దాల్చిన మా పతి హరి
ఆ హిరణ్యాక్షుని యణచ వరాహమై
పుడమిని గాచిన భూపతి హరి
ఆ హిరణ్య కశిపు నడగింప నరసింహ
మూర్తి ప్రహ్లాదానువర్తి హరియె

తే॥ గీ॥ వామనావతారంబున వర మదాంధు
బలిని పాతాళ మునకంపె బలిమిని హరి
ఆర్త రక్షణకై హరి అవతరించు
అడిగినంతనె ఔననున్ హరియె నిజము ॥

4. పరశురాముడై పుడమిని పరశువెత్తి
కార్తవీర్యుని, దుష్టుల కాలరాచె
తల్లిని మరల బ్రతికించె తండ్రి నడిగి
కేశవుని తెలియ తరమా లేశమైన ? ॥

5. ఎక్కడైన నెప్పుడునైన ఎటులనైన
ఎవరు భక్తిగా వేడిన నేతి యనక
శ్రీహరి యవతరించు నే రీతినైన
నమ్మిగొల్చిన వారికి న్యాయమొసగు ॥

6. దుష్ట శిక్షణ కోసము శిష్ట రక్ష
కొఱకు ప్రభవించు చుండును కోరినపుడు
తలచు భక్తుల కష్టముల్ తనవిగాను
వారికి సుఖ సంతోషముల్ వరుస నిడును ॥

7. సీ॥ ఉగ్ర తపంబున యుర్విని వణికించె
రావణుండనునొక్క రక్కసుండు
భక్తితో స్తుతియించి భగవంతు మెప్పించ
శక్తిని జూపె నిశాచరుండు
పరమేష్ఠియు పినాక పాణియు వరమీయ
గర్వమ్ముతో తిరుగాడుచుండు
జగతిని మునులను జనులను పీడించి
లోకకంటకుడయ్యె లోకనాథ



తే॥ గీ॥ అనుచు పీడిత ప్రజలంత వినయముగను
చక్రపాణిని చేరిరి శరణుకోరి
లంక తేనిని జంప వేరింక లేరు
సాధ్యమగునీకె కరుణించు సార సాక్ష ॥

8. వరము కలదయ్యె వానికి వానరులును
నరులు తప్ప నిర్జింపగ పరులవలను
కాదు వినుము కష్టమ్ముల కడలి దాట
నీవె చుక్కాని మాకింక నీవె శరణు ॥

9. సీ. పాల కడలిపైన పాన్పుగా నమరెను
ఆనందముగ నీకు ఆదిశేషు
అలసిన నీ పాదముల నొత్తి మురిపాల
అలరించు నర్ధాంగి ఆదిలక్ష్మి
పాపుల పరిమార్చు పాలకుడవు నీవు
హరి మాకు నండవు ఆది నుండి
దైత్య సంహారమ్ము దయతోడ జేసి మా
ఆర్తిని బాపుము ఆదిదేవ

తే. గీ. వెన్నుని మునులు వేల్పులు వేడుకొనిరి
శీఘ్రమె యభయ మిచ్చెను శ్రీహరియును
దశరథునకు తనయునిగ ధరణి నరుని
గా నవతరించి బ్రోచెద గాక యనుచు ॥

10. సీ. శ్రీహరి వీక్షించి శ్రీదేవి నలవోక
కనుసన్న భాషించె కలికితోడ
రావణు వధియించి రాక్షసుల నణచు
సత్కార్యముంజేయ సమయమనుచు
పరమార్థ మెరిగిన పరమ సాధ్వీమణి
పతియాజ్ఞ తలదాల్చి పయనమాయె
మందహాసమున యా మందగమన యేగి
జనకునింట వెలిసె జనక సుతగ



పుత్రకామేష్టి యాగం

తే. గీ. అంకురార్పణ జరిగెను అవని దైత్య
నాశనమునకు యీ జగన్నాటకమున
దేవుడే తలంచగ కాని దేమియుండు ?
ప్రార్థనల కరుణించును ప్రభువు ఎపుడు ॥

11. బీటవారిన భూమికి నీటి జల్లు
సరిగ తగును ముత్యమునకు స్వాతివాన
తాము హరి దయా రస వృష్టి ధరణి కోరి
ఎదురు చూచుచుండిరి జను లెదల నిండ ॥

12. చింత తొలగి యాశగను వారంత గూడి
రామ చంద్రుని దర్శనార్థమ్ము వెడల
చైత్రము పునర్వసు శుభ నక్షత్ర మందు
అవతరించెను విష్ణువు అవనియందు ॥

13. పుత్ర కామేష్టి యాగమ్ము పుడమి జేసి
ఇహపరములొందె దశరధుండిమ్ము గాను
హర్షమందె నృపతియును యాగ ఫలము
తనయుల నలుగురిని జూసి తనివి దీఱ ॥

14. హరియె కారణ జన్ముడై యవతరించ
సుతుల నామకరణ జేసె సతుల గూడి
రామలక్ష్మణులును మహారమ్యగుణులు
భరత శత్రుఘ్నులనగ వైభవము దనర ॥

15. చిరునగవు చిందు వదనమ్ము చిలిపి యాట
చూసి మారాము మారాంను చూడ రండు
అనుచు తల్లి దండ్రులు పుర జనులు కలసి
సంబర పడు సందడి తాకె నంబరమును ॥

16. జలక మాడించి పన్నీట జనని మురియు
గోరు ముద్దలు తినిపించు కోరి కైక
అందుకొందును యిప్పుడే చంద్రు ననగ
అందముగ జూపును సుమంత్రుడద్దమందు ॥

17. సీ. శ్రద్ధగ విద్యలు సకలమ్ము నేర్వగ
గురువులు మెచ్చిన కొమరుడయ్యె
తండ్రియు మురియగ తల్లులు పొంగగా
రాముడు నాదర్శ ప్రాయుడయ్యె
అస్త్ర శస్త్రమ్ముల నవలీల యుద్ధనై
పుణినేర్చి తాపరి పూర్ణుడయ్యె
జనమంత ముగ్ధులై జయమంచు జేజేలు
పలుక రాముడు జన వంద్యుడయ్యె

తే. గీ. ఇడుము లను దీర్చు రాఘవు డిలను పుట్టె
శరణు వేడిన యంతనే శక్తి జూపు
దీక్ష బూనియు దుష్టుల తీరు మార్చు
తమ్ము గావునంచు మునులు తలచిరపుడు ॥

18. తనయులను గాంచి మహరాజు తనివి తీర
మురియు వేళ నేతెంచె నా మునియు జేని
కుశల మడిగియు రాజర్షి కౌశికుండు
వెంటనే రాము నంపుము వెంటననియె ॥

19. కమ్మనికల చెదిరి కీడు కలిగినటుల
నోటి ముందు విందును లాగెనో యనంగ
నీరమందియు దాహమ్ము తీర నటుల
సంకటపడియె నారాజు సంశయమున ॥



20. కన్న బిడ్డలు ఋషి వెంట కానకేగ
సమ్మతించలేక మునిని సాగనంప
లేక మారాడగ వలను గాక ప్రభువు
వగచె తనలోన నా విధి వశము వలన ॥

21. శాపమిడునేమొ కుపితుడై తాపసియని
భయము నొందియు రాజు సందియము వీడి
సత్య దూరుడు కాలేక సమ్మతించి
బాలకుల నంపె యెనలేని బాధతోడ ॥

22. వినయమున రామలక్ష్మణుల్ వెనుక రాగ
సకల విద్యల నెరిగించి సాయుధులుగ
కావలుంచెను యాగ రక్షణకుమౌని
నేర్పుగను దైత్యులను జంప నేర్చెవారు ॥

23. వారు నత్యంత దీక్షతో వనము నందు
యాగ సంరక్షణార్థమ్ము యతుల గూర్చి
కానవచ్చిన దైత్యుల కావరమ్ము
కూలద్రోసి వారల పాఱద్రోలసాగె ॥

24. తాటకి సుబాహులను జంపి తాపసులకు
భీతి పోగొట్టి రాముడు ఖ్యాతి గాంచి
మాయ మారీచు దరుమంగ మరియు మునులు
పూర్తి చేసిరి యాగమ్ము పూర్ణముగను

25. గురువు నాజ్ఞానుసారమ్ము గిరులు తరులు
అధిగమించి మిథిల జేరు పథము పట్టి
దారిలో శిలా రూపంబు దాల్చినట్టి
వనిత రామ పాద రజము వరము పొందె ॥

32. సీ. కౌసల్య తనయు నా కౌశికుండును జూసె
నీ ప్రజ్ఞ తెలియుటె నిక్క మనుచు
దరహాస వదనాన ధరణిజ దెస జూసె
నీలమేఘుం డొక్క నిముషమెంచి
సిగ్గు దొంతరలనా సీతయు జూసెను
తనవిభుం డతడని తలచు కొనుచు
ఇనకులేశునివంక నీశుతో చూసిరి
వరులంద రేకమై వరుసగాను

తే.గీ. మ్రొక్కె గురుచరణములకు మ్రొక్కె దశర
ధాత్మజుడు నీల కంఠుని ధనువునకును
వినయ సౌశీల్యమూర్తి యా విల్లునెత్త
సభికు లుత్కంఠ తనుసైప జాలరైరి

33. మేని ఛాయ పుష్కరదము మేలు మేలు
బాహులాజాను బాహులు బాగు బాగు
కరుణ కురిపించు, చూడ చక్కనివి కనులు
సూక్ష్మగ్రాహిగా తెలిపెడు సూదిముక్కు

34. రెండు కలువలు విరహము మెండుగాగ
చంద్రుడని యెంచి శ్రీరామచంద్రుజేరి
వదన బింబమ్ము నమరెనొ వలపు మీరి
యనగ రాముని నయన ద్వయమ్ము నొప్పె

35. సాహసము కార్యదీక్షయు సహజములుగ
రూపు దాల్చెను రాముడు చూపులకును
రాచఠీవియు తేజము రాజిలంగ
ఇనకులేశుడు మకుటాయ మానుడయ్యె



36. సీ. జీవనాధారమై జీవుల బ్రతికించు
దినకరుండై యొప్పె యినకులుండు
నభమున తారల నడుమను శోభించు
చంద్రుడై సభ రామ చంద్రుడుండె
స్వర్గాధిపత్యమ్ము సకలమ్ము పాలించు
ఇంద్రుడై యా రాఘవేంద్రు డుండె
తండ్రికి సీతకు తగు నాశ చిగురింప
శూరుడై రఘుకుల మారుడుండె

తే.గీ. వీనుల వఱకు లాగుచు వింటి నారి
శరము సంధించ బూనిన క్షణములోన
ఫెళఫెళారావముల మధ్య పెళ్ళుమనుచు
విరిగె వింతగాను శివుని విల్లు అకట

37. పసిడి నవ్వులు పండించి పడతి సీత
రమ్యముగ వాల్గనుల రఘు రాము జూసి
తనదు జన్మ సార్థకమైన దనుచు తలచి
విరుల దండను వేసెను వరుని మెడను ॥

38. రాము సౌందర్యమునకు శౌర్యమ్మునకును
జనని, జనయిత ముదమున, జానకమ్మ
కలలు పండెనో యనగను కౌశికునకు
పలికె శుభమంచు కోదండ పాణి నఱసి

39. శివుని విల్లును విఱవంగ శీఘ్రగతిని
పరశురాముడు వచ్చి కోపమ్ము జూప
లేశమైనను భేదమ్ము లేదు, శివుడు
కేశవులటంచు హితమున క్లేశమణచె



పరశురామ గర్వభంగం



సీతా కళ్యాణం



40. ప్రళయ కాల రుద్రుపగిది పరగి, సభను
పరుష వాక్కుల దూషించు పరశురాము
శాంత పఱచిన రాముని శాంత గుణము
తెలియ జెప్పె విశిష్టత దివ్యముగను

41. సీ. వర్తమానము బంపె వడిగ నయోధ్యకు
జనకుడు శ్రీరామ జనకునకును
పరమ సంతోషమున్ పయనమాయె నృపతి
సకుటుంబ పరివార సహితముగను
మిథిలా నగరిలోన మిన్నంటె సందడి
మగ పెండ్లి వారల మంచి జూచి
ఘనమైన యేర్పాట్లు జనమంత చేసిరి
ఎపుడెపుడాయని యెదురు చూసి

తే.గీ. వేనవేలుగ జేరిరి వేడ్క జూడ
సీతరాముల పెండ్లికి సిద్ధమగుచు
భూసురుల్ సురుల్ శుభమంచు భువిని దివిని
ముక్త కంఠాన దీవింప మురిపెముగను ॥

42. తనయుల వివాహముంజేయ తమకమునను
ఆప్తులందరు ప్రేమతో అనుసరించ
తరలి వచ్చిరి తండ్రియు తల్లులంత
స్వాగతము జెప్పె జనకుడు సాదరముగ ॥

43. ఎదురు సన్నాహములు జేసి యెదుట నిలిచి
తాను వియ్యాల వారికి తగిన విధము,
అతిథి మర్యాద జనకుడు అతిగ జూప
కొల్లగను సంతసించిరి యెల్లరపుడు ॥

44. సీ. తలలకు స్నానమ్ము తలపెట్ట వధువరుల్
తలమానికములుగా ధరణి నిలిచె
జలదశరీరుని జలకంపు పన్నీరు
ఏఱుగా పాఱి యింపారజొచ్చె
సౌందర్యరాశి యా సౌశీల్య నీలాలు
వారాశి యలలునై వాసి గాంచె
రాముడు ధరియింప రత్నహారములకు
ఇలలోన ప్రఖ్యాతి యినుమడించె

తే.గీ. రవ్వలు తొడిగి కన్యకా రత్నమునకు
పట్టు చీరను గట్టిరి పదిలముగను
సకల శుభ లక్షణంబుల సరళి జూడ
వరునకు దగిన వధువుగా వారు నిలిచె ॥

45. నీలగగనమ్ము నందలి నిర్మలతను
ధాత్రి యందలి సహనంపు ధర్మమునను
మేరు పర్వత ధీరతన్ మేను దాల్చి
ఉల్లములు దోచె రాముడు యెల్లరకును

46. సీ. అరవింద దళనేత్రు నందాల రాముని
చూడ వేడ్క జనులు చూచుకొనిరి
సోగకన్నుల సీత సోయగమును జూసి
అచ్చెరువునవారు అచ్చరనిరి
ఆదర్శప్రాయమై యలరారు నాజంట
యంచు పరవసించి యందరనిరి
ఆ వధూవరులను ఆయలంకరణలు
తీరు జూడ తనివి తీరదనిరి



తే.గీ. సంపదలు లభించినయట్లు సంతసించి
పెళ్ళికిని యంద రచ్చట పెద్దలైరి
కనగ దేవుని పెళ్ళికి కాగలరట
అందరును పెద్దలేయను చందమునను ॥

47.సీ. సీతను రాముని సిద్ధము చేసిరి
మంగళ కరముగ మనసు తీర
కళ్ళకు కాటుక కాళ్ళకు పారాణి
చక్కని బుగ్గల చుక్కలమర
కళ్యాణ తిలకమ్ము కడునిండు దనమిచ్చి
కమనీయ వదనాలు కళల దనర
పెళ్ళికి చూడగ వెళ్ళిన వారిగే
కలిమి యనంగను కనులు చెదర

తే.గీ. వైభవమ్ముగ నా వధూవరులు నొప్పె
అంద చందాలు సుగుణాలు అవధి లేక
జగతి నీ పెండ్లి ఖ్యాతి పొంద గలదంచు
తలచిరి జనులు తిలకించి తనివిదీర

48. రామచంద్రుడు చూసెనా రామ దెసను
కలువ కన్నియ సొగసును కనుల నిండ
చిరనగవు చింద నొలికెను సిరులు । పెండ్లి
యాడె సీతను లోక కల్యాణమనగ ॥

49. బ్రాహ్మణాశీస్సుల నడుమ బ్రహ్మదేవ
గణము శుభమస్తు అనుచుండ ఘనముగాను
వేద మంత్రముల్ మంగళ వాద్యములను
సీతరాముల పెండ్లయ్యె శీఘ్రముగను





50\. లక్ష్మణ భరత శత్రుఘ్నులకును జరిగె
పాణిగ్రహణములును, నభోపథమునంటె
శుభ ముహూర్తంపు సవ్వడి, సురులు జల్లె
విరులు । దీవించిరి జగతి విబుధులెల్ల ॥

51\. పెండ్లి వేడుకల్ శోభలు పెచ్చుగాగ
ముత్యములు తలంబ్రాలుగ ముదము గూర్చ
నిండుగను జూడ చాలవు రెండు కనులు
జన్మ సార్థకత తెలిసె జనులకపుడు ॥

52\. కం. శ్రీరామ నవమి నాడే
శ్రీరాముని జన్మదినము సీతను నాడే
శ్రీరాముడు పెండ్లాడగ
ఆరామదె భాగ్యమనిరి ఆరాధనతో

53\. కం. భూసుత పెండ్లికి నరుగై
చూసెను పుడమి, గగనంబు చూసెను తానై
వేసియు పందిరి, జనకుడు
ఆ సీతకు తండ్రిగాను యశమును పొందెన్

54\.తే.గీ. సజల నేత్రమ్ముల తనయాత్మజుల జూడ
మనసు పురివిప్పిన నెమలి యనగనాడ
తపము ఫలియించె నంచును దశరధుండు
వర్ధిలమనుచు దీవించె వారినపుడు

55\. వచ్చినట్టివారికి కాన్కలిచ్చి పంపె
జనకుడు దశరధుండును జాప్య మింత
లేక చేతి కెముకయును లేని రీతి
భూరి దానములిచ్చిరి భూసురులకు ॥

56. పెళ్ళి విందుకు వచ్చిరి పెద్దలంత
శుచిగ వండిన వంటలు రుచికి మిన్న
యనగ చేయించి పెట్టుచు జనక రాజు
తృప్తి తీర వారు భుజించ తృప్తిబొందె ॥

57.సీ. పంచ భక్ష్యంబులు పరమాన్నములతోను
పూర్ణమ్ము బూరెలు బూంది లడ్లు
పప్పు దప్పళములు పచ్చళ్ళు కూరలు
కమ్మని నెయ్యియున్ గడ్డ పెరుగు
పులిహోర వడలును పూట పూటకు జేసి
అప్పడాల్ వడియాలు ఆవకాయ
పిండి వంటలతోను పెళ్ళి విందునకును
మధుర ఫలంబులు మరియు బెట్టి

తే.గీ. కప్పురంపు విడియములు ఎప్పుడైన
గూర్చ, కోసల వాసుల గూడి మిథిల
జనులు నేకమై తృప్తితో కనులు మెరియ
పరవశించిరి తమరిదె భాగ్యమనగ ॥

58.తే.గీ. భక్తితో పఠియించిన బాలకాండ
ఆయురారోగ్య శ్రీలును అమరగలవు
విన్నవారును పొందుదు రన్న నిజము
రామ భద్రుని నమ్మిన రక్ష కలుగు



# అయోధ్య కాండ

59.తే.గీ. రాజు నాజ్ఞను పెళ్ళివారంత తరలె
కోసల తరుణుల్ పిల్లల కోర్కె తీర
రథ గజ తురగ తతి యతి రయమునచట
పయన మాయెను చతురంగ బలముతోడ ॥

60. తనయ, నెడబాసి మనలేక తల్లి దండ్రి
తపనతో తల్లడిల్లియు తప్పదనుచు
భాష్ప పూరిత నయనాల భారముగను
ఇంతి నంపిరి యత్తవారింటికపుడు ॥

61. నాధునిగ నవనిజ జగన్నాధు పొందె
నిజ మెరిగినను రాజర్షి నిలవ కుండె
కన్నవారి బాధ దిగులు కన్న దోచు
సములె సామాన్యుడును రాజు సరిగ నిందు ॥

62. జానకీ రాములేతెంచు జాడ నెఱిగి
నగరు నుత్సాహ భరితమనగను వీధు
లంత దీప తోరణము లలంకరించి
వేచి యుండిరి ప్రజలంత వేయి కనుల

63. కనుల కళ్యాణ కాంతు శోభను గనగను
రమను తలపించు మైథిలీ రమణి దీప్తి
నెల్లరును మంత్ర ముగ్ధులై యుల్లములను
వెన్నుడని రాము బొగడిరి వేయినోళ్ళ

64.కం. నూతన వధూ వరుల గన
నాతుర తపురమున యా జనావళి యేగెన్
సీతారాముల గాంచియు
మా తపము ఫలించె ననుచు మదిలో తలచెన్

65. తే.గీ. పుట్టినింటిని పేరును మెట్టినింటి
ఖ్యాతి నిలుప నెన్నగ లేని రీతి మసలి
మృధు మధుర వాక్కు నందరి మదుల గెలిచి
నెలత సీత మన్ననలందె నేర్పుతోను ॥

66. అత్తమామలం జూచును ఆదరమున
తోటి కోడళ్ళ నెయ్యము తోడ మెలగు
మరదుల నభిమానించుచు మమత జూపు
భూమిజను పదుగురు మెచ్చె భువిని యెంతొ ॥

67. సహనమున సీత భూమాత సరళియనగ
జ్ఞాన సంపదన్ జనకుడు జనకుబోలి
పెద్దలను భక్తి సేవించు పెద్ద మనసు
కలిగి యలరించె వైదేహి ఘనముగాను ॥

68.తే.గీ. మెలిగె పతి కనుసన్నల మిథిల రాజ
పుత్రి । ఆత్మార్పణమ్మున పూత చరిత
సాధ్వి । ఆదర్శ మయ్యెను సర్వులకును
అంగనలు ధన్యులౌదురు ఆమె గొల్చి ॥

69. అందమున మన్మధుని మించు । డెందమందు
కరుణ, శౌర్యమందున సాటి కారు ఎవరు
అట్టి సుగుణాభిరాము చేపట్టి సీత
ధర్మపత్నిగ జన్మము ధన్యమయ్యె ॥

70. తమ్ములను ప్రేమగా చూచు దాశరథియు
అన్నయడుగు జాడలు వారు అనుసరించు
వారి యన్యోన్యతం జూచి ఊరివారు
అచ్చెరువు నొందుచుందురు అధికముగను ॥



71. తనదె యదృష్టమనగను దశరథుండు
సుతుల సఖ్యతకును తన సతుల గూడి
ముదిమి నారాజు మదినెంతొ ముదము నొంద
నోచెనేమొ పుణ్యంబగు నోములెన్నొ

72. సీ. ఇనకుల సోముడు యిలలోన దేవుడు
సుందరాకారుడు సుగుణశీలి
తండ్రియెడల భక్తి తల్లులందనురక్తి.
సమభావమును జూపు సహనశీలి
ప్రియ సోదరుల యందు ప్రేమకు పెన్నిధి
దైత్యుల నణచిన ధైర్యశాలి
ఏకపత్నీ వ్రతమేక శరము బల్కు
బాటగా నడచు సన్మార్గ దర్శి

తే.గీ. రామ భద్రుడు తమనేలు రాజుగాన
రామ పట్టాభిషేకమ్ము రయము జరుగు
నింక । రామునకును లేదు వంక శుభము
శుభమని జనులు తెలిపిరి సుముఖులగుచు

73.తే.గీ. ఊరు నంతయు నొకదారి యులిపి కట్టె
ది యొక దారి యనగ దాసి దిట్టయైన
మంథరయు రాణి కైకేయి మందిరమును
జేరి చెడు చెప్పి చెవిలోన చేటు తెచ్చె ॥

74. దాసి మాటలు తలకెక్కి దారుణముగ
కోరె వరముల కైకేయి కోపగించి
గుండెలవిసిన మహరాజు కుందుచుండ
కోమలి కరుణించనె లేదు కొంచెమైన ॥

75. సీ. కైక చేరగ కినుక నలుక పానుపు
కాయము కంపించి కాక జూపె
కన్నులెఱ్ఱబడగ కలికి విసుగు మోము
అధరమ్ములదరగా అలుక జూపె
కేశముల్, విరబోయ, కేకయి, క్లేశమ్ము
విసిరిన, నగలున్న, విధము జూపె
దరిజేరి బ్రతిమాలు దశరథున్ గోరెను
వరములు రెంటిని వగలు జూపి
తే.గీ. భరతుడేలవలెను రాజ్య మకుటమునను
రాముడు పదునాలుగు వత్సరమ్ములు, వన
వాసమును జేయవలె నంచు వరములడుగ
పాడి కాదంచు నారాట పడియె నృపతి ॥

76. సత్యదూరుడు కాలేక సతికి చెప్ప
లేక రామున్వనికి పంపలేక మిగుల
చింత నొందుచు శ్రీరామ చింతనమున
దశరథుడు తన దుస్థితిందలచి కుమిలె ॥

77. వెడలె రాముడు వార్తను వినిన యంత
తండ్రి యానతి తలదాల్చ తలచి నంత
తోయజాక్షి సీతనడచె తోడుగాను
అనుసరించెను నీడగా యనుజుడపుడు ॥

78. సీ. వనికేగ మనగను వల్లె యనుచు వేగ
పయనమ్మునకు సిద్ధ పఱచమనెను
తనకై పరితపించు తల్లిని వారించి
తండ్రి యాజ్ఞయె శిరోధార్యమనెను
జననికై కనుదిట్టు జనులను వలదంచు
మనకన్న విధి బలమైన దనెను
పినతల్లి కోరిజూపిన బాట యిదియంచు
బాసలు దీర్చుట భావ్యమనెను



తే.గీ. తనయు డాడిన మాటలు తాను వినియు
కన్నులు చెమర్చి రాముని కనగ లేక
నోట కానకేగు మనెడు మాట రాక
తల్లడిల్లెను ప్రభువును తాళలేక ॥

79. శోకమున పతి మూర్ఛను సోలియుండ
నార చీరలు తెచ్చెనా నారి కైక
చిర్నగవు మోము రాముడు స్వీకరించ
కాలువలు కట్టె నెల్లరి కనుల నీరు ॥

80. ఆశ పడిన జనుల కామె అడ్డమాయె
చేతి కందునట్టి ఫలము చేయి జారె
కన్న కలలన్ని చిటికెలో కల్లలాయె
లేశమైనను ఫలితమ్ము లేకపోయె ॥

81.సీ. కార్ముకమ్మును బూని కారణ జన్ముడు
కానకు నడచె కంకణముకట్టి
నార చీరలు గట్టి నారాయణుడు తాను
కదలె ముందుకు సతి కరము పట్టి
పట్టాభిషేకమ్ము, పట్టణమ్మును వీడె
మాటయిచ్చిన తండ్రి మాటబట్టి
కైక కోరికలకు కట్టుబడుచు తాను
బయలు దేరెనటవి బాట పట్టి
తే.గీ. సర్వము త్యజించినవాడు సత్యవ్రతుడు
నరునిగా వెలసిన జగన్నాథుడతడు
కైక వరములె తాను రాక్షసుల సంహ
రించ తొలి సాధనమని తలంచె నతడు ॥






82. తే.గీ. చంద్రుడే లేని గగనమ్ము చందముగను
రామ చంద్రుడు లేనట్టి రాజ్యమందు
దిక్కులేక బ్రతుక లేము దిగులుతోను
దుఃఖపడసాగిరి జనులు దుర్భరముగ ॥

83. ఎల్లరి సెలవు గైకొని నెలవు వీడి
పురము వీడి విపిన మార్గమునకు బోవ
సీత సౌమిత్రులంగూడి శీఘ్రముగను
రథము నెక్కెను నవ్వుచు రాముడపుడు ॥

84. రాము నాజ్ఞను మంత్రులు రథము నడిపె
బాష్ప భరిత నేత్రంబుల భానుతేజు
కనగ లేకను వీడలేక నిక రామ
భద్ర ! కాఱడవిని సీత భద్రమనిరి ॥

85.తే.గీ. మర్మమెరుగని వారలమనసు లెరిగి
మంచి మాటలాడి తనకు మారుగాను
భరతు నాదరించుట మీకు భావ్యమనుచు
వెంట వచ్చిన వారిని యింటికంపె ॥

86. తేరు ముందుకు బోవగా వారు జేరె
పూజ్య భాగీరథీ నది పుణ్య తటము
నదిని దాటించ తనదె పుణ్యమని గుహుడు
దాశరథి సేవను తరించె దాసు ననుచు ॥

87. రాముడు తన దారా సోదర సహితముగ
చిత్రకూటమ్ము వాల్మీకి చెంతజేరి
ఆశ్రమ నివాస మారంభ మాయె నవగ
పర్ణశాలను నిర్మించె పదిలముగను ॥

88. విపినమందు రామాదుల విడిచి మంత్రి
విన్నవించెను వనవాస వివరములను
విన్న మహరాజు గుండె లవిసియు విడచె
ప్రాణ మప్పుడే రామ హే రామ యనుచు ॥

89. తే.గీ. పుత్ర శోకమున కుమిలి చిత్రముగను
విగత జీవుడగుటకు రాజు గత శాప
వశమటంచు నెఱింగి వివశులగుచును
పతిని గూర్చి దుఃఖించిరి పత్నులంత

90. శోక సంద్రమ్మున నయోధ్య సోలిపోయె
భరతుడే తెంచి రోదించె కరము రాజ్య
కాంక్ష లేదు తనకు తల్లి కాదు కైక
భూతమనుచు నిందించెను మాత నతడు ॥

91. ఉ. తానటు బోవ తల్లి కిటు దాసియె మంథర చెప్పిపెట్టెనే
తానటులేల జేసితని తర్జని జూపగ బుద్ధిహీనతన్
కానల పాలు చేసితని కారణమున్నది యంచు జెప్పినన్
రానిక రాజధానికిక రానని యా భరతాధిపుండనెన్ ॥

92. తే.గీ. రాజనగమా ప్రభువు రఘు రాముడొకడె
వినయముగ పాదముల నంటి వేడుకొందు
అన్న ! దిక్కెవరయ్య నీ కన్న మాకు !
అనుచు నేడ్చు భరతునెల్ల రనునయించె ॥

93. రాజ్యమేల ? నాకును చాలు రాముసేవ !
రామ భక్తి సామ్రాజ్యమే నా మనంబు
కోరునమ్మ ! యెంత చెడును కోరినావు
నీకె తగునమ్మ! యేలుకో నీవెయమ్మ !



94. నాడు ఆడించె విధి వింత నాటకమ్ము
పాత్రధారినే కాని నే సూత్రధారి
కాను విధియె విధించెను కనుక భరత
తగిన శిక్ష ననుభవించితయ్య నేడు ॥

95. ఒక్క పరి చూచి యా రామునొక్క మాట
నొక్కి చెప్పివత్తును నేను అక్కడున్న
చిక్కనైన యడవిలోన చిక్కియున్న
వారి నర్థింతు । నిక్కము వారి రాక ॥

96. తనయు జూడగ కౌసల్య తపన పడగ
తప్పు దిద్దుకొందని కైక, తాను కూడ
వత్తునని సుమిత్రాదులు వరుస నడుగ
భరతు డంగీకరించెను బయలుదేర ॥

97. కొమరు జూడగ నాశతో కోరి వనికి
చేరిరా తల్లులంతట వారి జూచి
మూగబోయిన మనసులో నూగుతున్న
ఊహలను గూడి భరతుడు నూరకుండె ॥

98.సీ. చిత్రకూటమ్మున జూచిరి రామచంద్రుని
తాపసుల నడుమ తాపసివలె
శరణంటు భరతుడు చరణములన్ వ్రాలి
రాజ్యమేలగ రమ్ము రామ యనుచు
తండ్రి నిర్యాణము తల్లుల దుస్థితి
విధి విలాసము నంత విశద పఱచె
కోరి వచ్చితిమన్న కోదండ రామన్న
అనుమతించియు మమ్ము ఆదరించు

తే.గీ. యన్న ! భరతు నోదార్చెనా యన్న మిగుల
పరితపించుచునే పరిపరివిధముల
కూడ వచ్చిన వారిని కుశల మడిగి
తాను ధైర్యము జెప్పెను తల్లులకును ॥

99. తే.గీ. అతివ సీతయు నెంతయో ఆదరమున
పాదముల నంటి ప్రణమిల్లి ప్రస్తుతించి
అత్తగార్ల క్షేమ మరయ నత్తలకును
జాలి గలిగియు కన్నీరు జాలువారె ॥

100.తే.గీ. అడవిని నడచి సుకుమారి అలసి యుండె
వన్నె తగ్గి యా కోమలి వదనముండె
అందమైనట్టి చేతులు కంది యుండె
వగచి రత్తలు కోడలి వరుస జూచి ॥

101. ఉ. కోసల నీదెనయ్యు ! మరి కూరిమి జూచిన, తల్లి కైకనే
ఆసగ వచ్చియుంటి నపహాస్యము చేయక నమ్ము నన్ను నే
నే సరి జేసుకొందునిక నేడు వివేకము కల్గె నేను రా
జేసిన నిప్పు నార్పగను జేరితి తప్పును కాయవే యనెన్ ॥

102. తే.గీ. కుల గురువులు సన్నిహితులు గూడి యెంత
చెప్పినను వినకను తానె జెప్పి నియమ
పాలనే ధ్యేయమంచును పట్టు బట్టె
మారు పలకంగ నేరికి మాట రాదె ॥



103. సీ. కారణ జన్ముడా కామితమీ డేర్చు
కారుణ్యమున మమ్ము గాచు రామ
కానకు పంపిన కైకయే కోరిన
కాదనవని నమ్మకమ్మె రామ
కౌసల్యయు, సుమిత్ర కలసి వచ్చి యడుగ
కాఠిన్యము వహింప గలవె రామ
కోదండ పాణివే కొండంత యాశతో
వేడితిన్ నా మొర వినవె రామ

తే.గీ. వెన్న బోలిన మనసున్న వెన్నుడనుచు
కడుగ కన్నీట పాదముల్ కరుగు ననుచు
నిన్ను ప్రార్థించు చుంటిమో యన్న ! నీదు
పాదుకలనైన యిచ్చి కాపాడుమయ్య ॥

104. తే.గీ. తమ్ముడు భరతు ప్రార్థనల్ తల్లి కోర్కె
పురజ నాభ్యర్థనలకును పురము పోవ
యిచ్చగింపక రాముడు యిచ్చి నట్టి
మాట మీరుట బహు నేర మనుచు చెప్పె ॥

105. ప్రజలు కోరిన విధముగ పాలనకును
భరతు డర్థించి నటులనె సరియె ననుచు
పాదుకల నిచ్చె రాముడు పట్టు విడచి
భక్తి శ్రద్ధల పూజించె భరతుడపుడు ॥

106. రామ నామస్మరణమందు రామ పాదు
కలను శిరమున దాల్చితా నిలను మఱచె
భక్తి పారవశ్యంబున భరతు డంత ॥
హర్ష మొందె రామానుగ్రహమ్ము బడసి

107. అన్న యాజ్ఞపై భరతుడు అన్న గూడి
తండ్రికై భక్తిగ విడచె తర్పణములు
తానె ధైర్యమ్ము చెప్పుచు తల్లులకును
మరల వెనుకకు వారిని మరల మనెను ॥

108. వాన ప్రస్థమందున బూనె వ్రతము నతడు
వెనుదిరిగి తాను కోసల వెళ్ళలేదు
శుభ ముహూర్తమ్ము నందు భూసురుల పిలిచి
పట్టముం గట్టె భరతుడు పాదుకలకు

109. పాదుకలు భక్తి పూజించి పాలనకును
పూనె నంది గ్రామ మనెడు పురమునందు
రామ నామ జపమున విరామ మిడక
భరతు డెదురుచూచుచునుండె భారముగను ॥

110. కం. గతము తలచి వగచుచు తన
మతము తనదిగ భరతుండు మదిలో రామున్
సతతము జపించుచున్ స్వా
గతము పలుకనన్న కొఱకు కాలము గడిపెన్ ॥

111. తే.గీ. భక్తిగ నయోధ్య కాండను పఠన జేయ
ఆయురారోగ్య భాగ్యము లమర గలవు
విన్న వారును పొందుదు రన్న నిజము
రామ చంద్రుని నమ్మిన రక్ష కలుగు ॥



# అరణ్య కాండ

112. సీ. దారిలో దైత్యుల దర్ప మణచి చేరె
దండక వనమును దాశరథులు
పావన నదులు నింపారుచు నొప్పగ
హరిత వనములను హర్ష మొందె
శర భంగుని సుతీక్ష్ణ సర్వులం గలియుచు
గడప సాగిరి వారు కాల మంత
వనికి వచ్చెను శోభ వర మది మీ రాక
అనసాగిరి ముదమ్ము యతులు నంత
తే.గీ. గడచె దశవర్షములు ముని గణము నడుమ
అవ్వనిని మెచ్చెబాగుగ అవని జాత
దానవుల పీడ వదిలించు దాశరథిని
ఎంతగానో పొగిడిరంత చింత బాసి ॥

113. తే.గీ. యాత్ర సాగించిరి యగస్త్య యతిని జూడ
అర్ఘ్య పాద్యమ్ము లిచ్చియు నాదరించి
అతిథి మర్యాదల నగస్త్యు డతిగ జేసి
వాసయోగ్యంబగు పంచ వటిని జూపె ॥

114. పుణ్య గోదావరీ తీరమునను అన్న
వదినె లను మతిన్, సౌమిత్రి వడివడిగను
పర్ణశాలను నిర్మించె పంచవటిని
ప్రీతి గొల్పుచు నచ్చోటు ఖ్యాతి గాంచె ॥


సూర్పనక ముక్కుచెవులు కోసిన లక్ష్మణుడు



115. సీ. ఎటు చూసినన్ సెల యేరులు పొదరిళ్ళు
ప్రకృతి సత్ సౌందర్య పరవశమ్ము
ఆహ్లాద కరమైన ఆరోగ్య ప్రదమైన
భావతరంగాల ప్రాభవమ్ము
పంచ వన్నెల పక్షి పంచమ స్వరమ్మది
మదిదోచు చుండునా మధురవమ్ము
కర్కశ మృగరాజ గర్జన మ్మొకవైపు
భయపెట్టు కొంత సమయము సుమ్ము

తే.గీ. కష్ట సుఖములు రెండును కానవచ్చె
తీపియు సగము చేదన్న తీరుగాను
వనము నా సుకుమారులు వసతిగాను
వాస ముండుట యా విధి వశము గాదె ॥

116. తే.గీ. ప్రకృతి రామణీయకతకు పరవశించి
వనము దిరుగు వేళ నసుర వనిత యొకతె
శూర్పణఖ నామధేయ యా శూరులందు
మోహమంది వెంటబడె వివాహమనుచు ॥

117. ముక్కు చెవులు నరుకుటయె నక్కుటిలకు
తగిన శిక్షంచు రామన్న తలచినంత
అన్న సూచనన్ సౌమిత్రి అసిని దూసె
ఆ నిశాచరి రోదించె ఆశ లుడిగి ॥

118. తే.గీ. ఘొల్లుమని శూర్పణఖ జేరె ఘోర రాక్ష
- సగణ మగు ఖర దూషణ సముఖమునకు
రుధిర మంటిన వికృత రూప మంత
జూసి కుపితులై రాముని జూప మనిరి ॥

119\. తే.గీ. మదపు టేనుగుల వలెను మరలిరాగ
కొదమ సింగము వోలెను అద్దనుజుల
సంహరించ। రాముని శౌర్య సంపదకును
మునులు పొగడిరి మిక్కిలి ముదముతోను ॥

120\. అసువులను బాసి పడియున్న అన్నదమ్మ
లన్క నిన శూర్పణఖ జేరి లంక రయము
రామ పత్నిని వర్ణించి రామలక్ష్మ
ణుల బలపరాక్రమము రావణునకు తెలిపె ॥

121\. సీ. భక్తిని, శివుని యభయ మీయ మెప్పించు
శక్తిని సురలోక సౌఖ్యమొందు
రక్తిని రమణీయ రమణుల రప్పించు
పూశరుం డగునంతి పురము నందు
దిక్కులన్ని జయించి దిక్పాలకుల నుంచు
దిక్కులేకుండగ చిక్కులందు
ఆ నిశాచరపతి అసమాన్యు డనిపించు
సాటిలే రాతని ధాటి కెవరు

తే.గీ. రాచకార్య మందుండ నా రావణుండు
శోకమూర్తియై టక్కరి శూర్పణఖయు
తన పరాభవ మన్నకు తరచి చెప్పి
మైథిలి సొగసు వర్ణించె మరియు కొంత ॥

122\. మగువ మాటలు సిగొలుప మరులు గొనియు
రావణాసురు డపుడె యారాటముగను
అందమైన బంగరు లేడి చందముగను
సీత మది దోచ మారీచు చెప్పి పంపె ॥



123\. ముచ్చటైన పసిడి జింక ముద్దు గొలుప
పట్టితెమ్మని జానకి పతిని గోరె
సతికి ముదము గూర్చగ రఘుపతియు వెడలె
తమ్మునుంచి మృగము వెంట తరుముకొనుచు ॥

124\. మాయ మారీచు డఱచెను మాయ జేసి
రాముని పగిది లక్ష్మణా ! రమ్మ ! యనుచు
ఆర్తి నర్థించె వైదేహి యాతురతను
అన్నగావగ బొమ్ము లక్ష్మన్నయనుచు ॥

125\. రాము డాపదపాలౌన ? రక్కసి గణ
మాయయగును నిన్విడ రామాజ్ఞ లేదు
వగవబనిలేదు శ్రీ రఘువరుని గూర్చి
రక్షకునిగనే నుండి తీరవలె నమ్మ ॥

126\. బంగరు మెకముపై యాశ భంగపఱచె
నా పలుకు జవదాట వన్నట్టి నమ్మ
కమ్మె నన్ను భంగపఱచె కాదె। యనుచు
లక్ష్మణుని బంపె మైథిలి లక్ష చదివి ॥

127\. వనమున వదిన నొంటిగ వదల లేక
ఆమె యాజ్ఞ నుల్లంఘించ నలవి గాక
యిష్టమును లేక సౌమిత్రి కష్టముగను
గిరిని దాటవద్దని చెప్పి యరిగె నపుడు ॥






128. సీ. అసురు నాంతర్యంబు నంకురించె నకట
కాకుత్స్థు సతిపైన కాంక్ష కాంక్ష
ఒంటిగ వైదేహి యుండుట గమనించి
రావణుండేగెను రయము రయము
కపట వేషమ్మున కాషాయములు గట్టి
పర్ణశాలకు పెట్టె పరుగు పరుగు
కోమలిం గొంపోవ గోరి యా మాయావి
భిక్షువై యాచించె భిక్ష భిక్ష

తే.గీ. భిక్ష వేయగ వచ్చియు భీతి చెంది
గిరిని దాటి యద్ధరణిజ గిరిని బోలు
ఆ దశగ్రీవు నట జూసి యక్కజమున
నేల కొరిగె దైత్యుం డన్న నిజము నెఱిగి ॥

129. తే.గీ. ఎత్తుకొని పోవ నిశ్చేష్ఠ నెత్తు కొనియు
దక్షిణము లాఘవమ్ముగ దైత్యుడపుడు
నింగి కెగుర జూసి తా నెదురు నిల్చి
అడ్డుకొనె లంక రేనినో యండజమ్ము ॥

130. రావణు నెదిరించె జటాయు రామభక్తి
సీత నాదుకో జూచి తాచేతనైన
దాక పోరి విహంగము డస్సిపోవ
ఎత్తుకొని పోయె దైత్యుడు చిత్తు చేసి ॥

131. దైత్యరాజ సింహుకు చిక్కి దైన్యముగను
భీత హరిణంబు రీతిని బిగ్గరగను
రామ। లక్ష్మణా యనుచు నఱచెను సీత
తన్ను గావగ పతి వచ్చు తప్పకనుచు ॥





132. తిరిగి వచ్చిన రాముడు తిరిగి తిరిగి
పత్ని గానక మిక్కిలి పరితపించె
విరహ వేదన తోడను విశ్వమంత
సూర్యవంశజునికి తోచె శూన్యముగను ॥

133. సతిని గానక సాకేత పతియు దిగులు
తోను చెట్లను పుట్లను తోటలోని
పూల సహిత మడిగి శోకమూర్తి యగుచు
వెడలె తుదకు వైదేహిని వెతుకుటకును ॥

134. దారిని జటాయు వగుపించె దాహమనుచు
రామలక్ష్మణులు దరి జేరగనె వగచి
దానవేశుడు చేసిన దారుణమును
తరుణి యాక్రందనను విశదముగ తెలిపె ॥

135. రామ ! రామ యనుచు పక్షి రాజ మపుడు
అసువులను వీడినంతనె ఆ జటాయు
వంత్యక్రియలను జరిపిరి యాదరమున
రామ చంద్రుడు క్రుంగె నిరాశ బొంది ॥

136. గగన మార్గమ్మ దశకంఠు గమన విధము
నెలత నెత్తుకుం బోవుట నెఱిగినంత
వెదుక బయలు దేరి రపుడా విపినమందు
రామలక్ష్మణులు జనక రాజసుతను ॥

137. తే.గీ. దుర్గమారణ్య పయన మందున దునిమెను
దనుజు లెందరినో కబంధాదులనగ
అతివ సీతను వెదుకుచు అడవిలోన
భక్త శబరిని కలిసిరా ప్రాజ్ఞులపుడు ॥

138. పక్షి కిలకిలల్ రామ జప మను శబరి
కోరి సెలయేటి గలగలల్ కొసరి వినుచు
ఏ చిరు సడి నుల్కిపడుచు యెదురు చూచు
రామ చంద్రుని పాదాబ్జ రజము గోరి ॥

139. ఒంటి శక్తి లేకున్నను కంటిచూపు
కొఱవడిన నొంటిగ రాము కొఱకు నెదురు
చూచు శబరి నోము ఫలించి చూడ గలిగె
పరవశమ్మున రాముని పట్టుదలగ ॥

140. సీ. ఆనంద భాష్పాలు అడ్డమై అడుగులు
తడబడె శబరికి తపన తోడ
శ్రమయు నిరీక్షణ సార్థకమ్మైనంత
ఒడలంత పులకించె ఒణుకు తోడ
ఫలియించె తన తపఃఫలమని మనసంత
భారమై తోచెను భక్తితోడ
ఆతిథ్య మిడుటకు నారాట పడుచును
అర్ఘ్య పాద్యము లిచ్చె యాశ తీర

తే.గీ. కన్నులున్నవి నీ రూపు గనుటకయ్య
వీనులున్నవి నీ పల్కు వినుట కయ్య
కాలుసేతులున్నవి సేవకరణియనుచు
సేదతీర భక్త శబరి సేవజేసె ॥

141. దోర పండ్లను దెచ్చియు దోసిటనిడె
ఆర మగ్గిన విచ్చెను యారగింప
మంచి వేరి పెట్టుచు తాను మమత తోడ
రుచిని చూసి మరియు పెట్టె శుచిగ నంచు ॥



142. భక్తు లర్పించు ఫలమైన పత్రమైన
క్షీరమైనను చివరకు నీరమైన
ప్రియమె దేముని కన్నట్లు ప్రీతినార
గించె వారు శబరి తరియించగాను ॥

143. చెలిమి కోరుము కిష్కింధ చేరి రామ ।
సహకరింతురు కపులని శబరి తెలిపె
రామలక్ష్మణులు బయలు దేరగనె యామె
భాగ్యమున ముక్తి పొందెను భక్తురాలు ॥

144. వెదకి పంపా సరస్సును వెడలె రామ
లక్ష్మణులు ఋష్యమూకాద్రి లక్షణముగ
సూర్యసూతియా సుగ్రీవుచూడబోవు
నంతట కపులే జూసిరి వింతగాను ॥

145. తే.గీ. ఈ అరణ్యా కాండ చదువ యింపుగాను
ఆయురారోగ్య భాగ్యముల్ అందగలవు
విన్న వారును పొందుదు రన్న నిజము
రామచంద్రుని నమ్మిన రక్ష కలుగు ॥

# కిష్కింధ కాండ

146. సీ. కోనకొండల దిర్గు కోదండ పాణుల
సుగ్రీవుడు కపులున్ చూసిరపుడు
వాలి పంపగ వచ్చు వారలని తలచి
జూసిరమ్మనె వాయు సుతుని యపుడు
దరిజేరిన హనుమ అరికాదు హరియని
పరికించి సాష్టాంగ పడియెనపుడు
తన యిష్టదైవమే తన కళ్ళ బడగను
ఆనంద బాష్పాలు అడ్డె నపుడు

తే.గీ. శ్యామ సుందరు శోభకు సౌమ్యతకును
పరవశమ్మున జూసెను పవన సుతుడు
చక్రియే రాము డంచని సరిగ నెఱిగి
ఆంజనేయుడు భక్తిగ నంజలించె ॥

147. విపిన మందున నాకపి వినయమునకు
మదిని లక్ష్మణుండు దనుజ మాయటంచు
సంశయించగ రాముడు సంతసమున
పలుకరించె కపిని దయ చిలుకరించి ॥

148. ఉ. కన్నుల నిండ సంబరము కాంతియు నిండెను భక్తితోడ యా
వెన్నుడు రాముడే యనుచు వేగమె పాదములంటి మ్రొక్కుచున్
నిన్ను గనంగ ధన్యుడను నీకగు బంటును మారుతిన్ సదా
నిన్ను భజింతు దాశరథి నీ దయ కోరుదు దైవమా యనెన్ ॥

149. తే.గీ. కాగలట్టి కార్యమదేమి ? కాఱడవికి
వచ్చి రేమని ? ప్రశ్నించె వాయుసుతుడు
మాయలేడి నటన సీత మాయమగుట
దనుజ చేష్టితమ్మను జెప్పె దాశరథియు ॥



150. వాలి సుగ్రీవుల విరోధ వార్త తెలిపి
ఋష్య మూకాద్రిపై మీ యిరువురి మైత్రి
మెయికొనంగ సుగ్రీవుడు మేలు జేయు
విన్నవించెను హనుమయు వినయముగను ॥

151. హనుమ చింతించె సీతాపహరణమునకు
తాము జూసినట్టి యొక వృత్తాంతమపుడు
జ్ఞప్తికిని వచ్చి చెప్పెను జరిగి నదియు
శ్రీ రఘువరుని సేవించ సిద్ధ పడుచు ॥

152. వైనతేయు నోటను బందియైన సర్ప
మటుల గిలగిల లాడుచు మగువ యొకతె
రామ । నను గావ వేవేగ రావె । రామ ।
అంచు గుండెలవియ నేడ్చె నంబరమ్ము ॥

153. చేటు కాలము దాపురించినదనేమొ
ఇక్కటుల దెచ్చు కొంటిని యిట్లు రామ ।
దనుజు బారి పడితి లక్ష్మణుని వినకనె
నాకు రక్ష నీవెయనుచు నగలు విసిరె ॥

154. తే.గీ. గగనమున విమానమ్మును గన్న కపులు
చిన్న పిల్లలై యాట్లాడుచున్నవేళ
చప్పటులతో పరుగు లెట్టి చక్కగాను
ఆ నగల మూట నాపట్టు నందుకొనిరి ॥

155. భద్రపఱచిన మూటను భద్రముగను
రామభద్రున కందించి రంత దెలిపి
ఆభరణములు సీతవే యన్న నిజము
నెఱుగ రాముని దుఃఖము పెఱుగ సాగె ॥








156. కం. సీతా। నిను జూడగలన ?
సీతా ! కాంతారము విడచి జనియు నిన్నా
భూతాల పాల జేసితి
నాతూణీరమ్ము దునుము నసురుని గనవే ॥

157. కం. కంటిని యాభరణములు
మింటిని మాయావి నిన్ను మెల్లగ గొనిపో
వింటిని। దశకంఠుని పొడ
కంటిరి కపులంత నేను కనవలె నిన్నున్ ॥

158. కం. అనుచు పరిపరి విధములుగ
తనలో తాను విలపించి తాపము చెందన్
అనుజుడు రవి నందనుడును
అణుకువ రాముని విరహము నణచగ జూచెన్ ॥

159. ఆ.వె. ఇనకులుండు మరియు వినతనయుండును
చేతులు కలుపుకొని చెప్పుకొనిరి
ప్రాణ మిత్తు నీకు బ్రతికినంతవఱకు
చెలిమికాడ యనుచు చేరి యచట

160. సీ. చెలిమికోరుచు వారు చేసిరి బాసలు
అగ్ని సాక్షిగ తాము ఆదుకొనగ
వాడిశరమ్మున వాలిని వధియించి
రాజు చేతునని యా రాముడనగ
రామపత్నిని జూచి రాగల మనుచును
సుగ్రీవుడనె మనః స్ఫూర్తి గాను
వారి నెయ్యము జూసి వానరుల్ గంతులు
వేసిరి మురియుచు వేడ్కగాను

తే.గీ. రామునండ దండలను వా రందుచుండ
జయము తథ్యమ టంచును భయము వీడి
శీఘ్రముగను సుగ్రీవుడు సిద్ధమగుచు
కదన రంగమ్ము నుసి గొల్వె కపులనంత

161. కాలు దువ్వె సుగ్రీవుడు కజ్జమునకు
భీరువైన సోదరుడిట్లు వీరుడగుట
ఆగ్రహమ్మున నుగ్రుడై అనుజుపైకి
దుమికె సింహమై గర్జించి ధూర్త వాలి ॥

162. మోహరమునన్నదమ్ముల మోము బోల్చ
కష్టమయ్యె । పెనుగిరులై కానవచ్చె
కయ్య మాడుచు ఢీకొను కపుల జూడ
పెరిగె పోరు భీకరముగ పెరిగె కసియు ॥

163. ఆనవాలుగ రాముడా యర్క సుతుని
మెడను గజపుష్ప మాలను కడకు వేసి
తరువు చాటున నిలుచుండి తరుణ మఱసి
చంపె వాలిని వేటాడు చందమునను ॥

164. రాఘవుండంత సుగ్రీవు రాజు జేయ
మాటపై నిల్వ పొగడిరి మాన్యులంత
తెలుసుకొనరైరి రాముని దేవుడనియు
కనగ శ్రీహరికి ఒక లెక్కనగరాదె ॥

165. కం. కామిత మీడేరి కపియు
తామై మరచి సుఖ జీవితమ్మున నుండన్
తామై గుర్తును జేయగ
రాముడనుజునట కంపె రాజును చూడన్ ॥



166. తే.గీ. అన్న యాజ్ఞను వెడలి లక్ష్మన్న తేని
తీరు నగ్నిలో నాజ్యమై దీసె ధనువు
కపులు భయపడి చెట్టుకొకరుగ పుట్ట
కొకరు పరుగెత్తె సౌమిత్రి కోపమునకు

167. కం. అరుదైన రాము చెలిమిని
కరుణను బొందియును కోతి కనుకే మతినీ
వరుసను నిలకడ లేకను
మరులు గొని మగువలగూడి మసలెను రేడున్ ॥

168. సీ. లక్ష్మణు క్రోధానల శిఖలు కిష్కింధ
నంతిపురిని జేరె నంతలోనె
భీతి చెందిన సూర్య సూతి దీనముగను
క్షమియించ వేడె లక్ష్మణుని తానె
కార్యదక్షుడు గాన కర్తవ్యమును జెప్పె
సౌమిత్రి శాంతము సహన మూని
ఏ జాగు చేయక యెదుర మాటయు లేక
కపుల బంపియు తేడు కలతమానె

తే.గీ. పట్టలేనియుత్సాహము పట్టుదలగ
వెడలిరి కపులు సీతను వెదుకగాను
నాల్గు దిశలకు పరుగిడె నమ్మకముగ
జయము శ్రీరామ కపిరాజు జయము యనుచు ॥

169. రమణి కిమ్మంచు హనుమకు రాము డిచ్చె
ఆనవాలుగ నంగుళీయకము దీసి
భక్తి శ్రద్ధల గైకొని భద్ర పఱచి
పయనమయ్యె దక్షిణ దిశ పవన సుతుడు ॥

170. మనసెరిగిన యర్ధాంగిని మదిని నిలుపు
కొంటినని చెప్పు నినుజూడ కోరి యుంటి
ననియు నసురుల జంపుదు ననియు చెప్పు
హనుమ । యని రాముడనె విరహమున మునిగి ॥

171. నిర్జ నాటవుల నెలంత నెలత కొఱకు
లోయలను కపుల్మేయుచు కాయ కసరు
కొండలును గుట్టలు వెదకి కొంచమేని
జాడ తెలియకే రాజుని జూడ వచ్చె ॥

172. దిక్కులన్నియు దక్షిణ దిశను దప్ప
చూచి వచ్చినా మింకను జూడగల్గు
పావని యొకడె యని యాశ పలికిరంత
రాముడెదురు చూడగ సాగె రాజు గూడి ॥

173. తాపసి స్వయం ప్రభయను తరుణి జూసి
మార్గమున హనుమాదులు మాటలాడి
సేదదీరియు నొక్కింత సేపు । సీత
జాడ తెలుపంగ వేడిరి జాలి గొలుప ॥

174. తే.గీ. రాజు నాజ్ఞ నుల్లంఘించరాదు । కాని
సాధ్వి సీతను గాంచ నసాధ్యమంచు
దిక్కు తోచక కపులంత దిగులు పడగ
మహిమ నామె కడలి జేర్చె మర్కట ముల ॥

175. రామపత్నిని గొంపోయి రావణుండు
కడలి కావల లంకలో కావలుంచె
అనుచు సంపాతి వివరించ యపుడు కపులు
ధన్యవాదముల్ జెప్పి రా ధర్మునకును ॥



176. ఎగరగల్గిన సామర్ధ్య మేరికుండె ?
ఆ యపార పారావార మధిగమించ
వానరులు విచారించంగ వారికా వి
హంగమే ధైర్యమును జెప్పె నంగదునకు ॥

177. అంగదుడు మన యువరాజు । అందు వలన
పోతగదు । నింక ఘన వాయు పుత్రుడె తగును
కడలి లంఘించి తిరిగిరా గలుగుటకును
వారికిని జెప్పె నా జాంబవంతుడపుడు ॥

178. వరుస నూరు యోజనములు వడిగ దాట
మారుతికి మాత్రమే సాధ్యమనుచు నీవు
తగుదు వనగనే పావని తనకు శక్తి
సరిపడున ? యని మదిలోన సంశయించె ॥

179. భుజ బలంబును నరుదైన బుద్ధి బలము
కల్గి, భక్తిత త్వరతయు గల్గి, ధైర్య
సాహసములు పరాక్రమ సంపదయును
కల్గిన ఘనులు నీకన్న కలరె యనిరి ॥

180. తొల్లి సందియ మునువీడి తల్లి సీత
కన్గొనగ నిశ్చయమ్మున కదలె హనుమ
రామ నామస్మరణ జేసి రయము నెగిరె
కొదమ సింహము వోలెను కొండపైకి ॥

181. మైథిలిని గన మాహేంద్ర మధివసించి
రోదసి కెగిరెగిరి శిఖరోపరితల
మందు వాయు వేగమ్మున మారుతియును
లంక జేరంగ సాగర లంఘనమున ॥



లంకాపురికేగె అంజనేయుడు.



182. రామ నామమె తమ యూపిరనగ హనుమ
కొఱ కెదురు చూచుటె పనిగ కోరి రాము
నమ్ముటె తమ కర్తవ్య మనగను కపులు
భక్తితో వేచి యుండి రాసక్తితోను ॥

183. కాలయాపనకు కపులు తాళలేక
వ్యథను చెందుచుండగ జాంబవంతుడు రఘు
రాము కథలన్నియు చవులూరగను జెప్ప
నిస్పృహను వీడి ధైర్యమ్ము నిలిచి రపుడు ॥

184. సీ. భువి జయ ప్రదమయ్యె పుత్ర కామేష్ఠియే
తనయులంబడయగ దశరథునకు
దశరథ నందనుల్ దనుజులం దునుమగా
జయప్రదమయ్యె రాజర్షిక్రతువు
శివధనుర్భంగము సీతమ్మ పెండ్లియు
జయప్రద మయ్యెను జనకునకును
వనవాస లక్ష్యము వరుస జయప్రదమ్మె
రావణు జంపగ రామునకును

తే.గీ. రాక్షసుల పీడ తొలగియు రామ రాజ్య
మేర్పడంగను జనులంత మెచ్చుకొనగ
భరతుని తపము ఫలియించు బాధ తొలగు
అన్ని పనులును జయప్రద మౌను వినుము ॥

185. తే.గీ. అంజనీ సుతు సామర్థ్యమందు గురియు
రామచంద్రుని యందున్న స్వామి భక్తి
నాదు మాటలందుంచుము నమ్మకమ్ము
శుభము కల్గును తప్పక చూచుచుండ ॥

186. తే.గీ. జాంబవంతుడు హితబోధ చాలజేయ
వడలి వాలిన మొక్కలు వారి నొంది
జీవ మందిన చందమా జీవులంత
ఆశ చిగురించ గెంతిరి హర్షముననను ॥

187. రాము డసమాన శూరుడు రావణువధ
తథ్యమని నమ్మి కపులంత తగిన రీతి
తలొక కథ చెప్పుకొని సమాధానపడుచు
యెదురు చూడసాగిరి తాము బెదురు వదిలి ॥

188. చదువ కిష్కింథ కాండను చక్కగాను
ఆయురారోగ్య భాగ్యముల్ అందగలవు
విన్నవారును పొందుదురన్న నిజము
రామునే నమ్మిన మనకు రక్ష కలుగు ॥





# సుందర కాండ

189. సీ. జలనిథి దాటంగ జాగుచేయక తాను
పర్వతాకారుడై పవనసుతుడు
మింటికి నెగిరెన మిత వేగ గమనుడై
కార్యసిద్ధికిని దీక్షాపరుండు
మార్గ మథ్యంబున మైనాకు వీక్షించి
కదిలెను ముందుకు కపివరుండు
సురసను దాటెను సులభమ్ము శ్రీరామ
ధ్యాన మాయుధముగ దాల్చి యతడు

తే.గీ. నోరు పెంచిన సింహిక నోట దూరి
కాయమును పెంచి యవలీల కాలరాసి
శరము కంటె వేగమున దాశరథి దయను
జలథి దాటె నసాధ్యుడు జగతి మెచ్చ ॥

190. తే.గీ. మారుతి త్రికూటమ్మున నూరు యోజ
నములు లంఘించ శీఘ్రమ్ము నమ్మకముగ
కాన వచ్చె దవ్వునను లంకానగరము
అందు సీత నెందును దాచె నంచు దలచె ॥

191. పట్టణమ్ము ప్రవేశించ బయలు దేర
అనిల సుతునంత లంఖిణి యడ్డగించె
తొలుత నా రక్కసి నణచి తెలివిగాను
చిన్న వానర మయ్యెను చిటికెలోన ॥

192. సూక్ష్మ రూపమ్ము దిరుగుచు సూక్ష్మ గ్రాహి
వనములును రాక్షస గణ నివాసములును
నాల్గు మూలల పరిశోధనలను జేసి
రావణుని వైభవము నబ్బురంబు బొందె ॥






**193.** స్వర్ణ నిర్మిత ప్రాకార సహితమైన
కోటలోను, సుందరమైన తోటలన్ని
శూల పాణుల రక్షణన్ జూసి తాను
అప్రమత్తుడై తిరుగాడె హనుమ యపుడు

**194. సీ.** కోతి గంతులు వేసి కోటలో దూరెను
కోమలి వైదేహి కోస మతడు
మేడలు మిద్దెలు మేదినీతల మంత
విశదంబు చూసెను వింతలతడు
అందమైనట్టి వారంద వికారులు
అసురుల గాంచెను అక్క డతడు
వారిలో వెదికెను వారిజాక్షి కొఱకు
భవనముల్దిరిగి నిర్భయమునతడు

తే.గీ. ఎందు జూసిన గానక యిందు ముఖిని
లంక చుట్టెను పలుమార్లు శంకతోను
నగరమో లేక నాకమో నమ్మలేక
అబ్బురపడెను పావని అడుగడుగున

**195. తే.గీ.** అవనిజాన్వేషణమ్మున పవన సుతుడు
కోట లందున మేలైన చోటు లందు
సందు గొందుల వెదుకుట సాధ్యమవగ
సహకరించె వెలుగు నిచ్చి శశియు నిశిని ॥

**196. సీ.** అపురూప నగరమా యమరావతిని బోలి
ఆ లంక నగరమ్ము అలరె నకట
స్వచ్ఛంద శీతల సలిల సుందర సరో
వరము లుండె మనోజ్ఞ వనరులచట
అంబర చుంబిత హర్మ్యంబుల సొగసు
తిలకించె మారుతి తిరిగి యచట
రామపత్నిని జూడ రావణావాసమ్ము
జొచ్చి పూబోడుల జూచె నచట





తే.గీ. వివిధ విధముల వనితలు వింత గొలుప
వారు మైమర్చి పవళించు వరుస జూసి
కన్ను లఱచేతు లనుమూసి కొనుచు
సీత యందుండ బోదని ఛీత్కరించె ॥

197. సీ. గుబురు కొమ్మల గుంపు గూడియు శింశుపా
వృక్షమ్ము లుండ సమృద్ధిగాను
వింత యాకృతులును చెంతను కరవాల
ముల కాపు కాసెడు ముష్కరులను
కఱకు కంఠమ్ముల కర్కశ వచనముల్
బల్కు నిశాచర పడతులాను
అంతట తిరుగుచు ఆంజనేయుడు చూసె
ఎత్తు గోడల పైకి నెగిరి యెగిరి ॥

తే.గీ. అదియె కవనమగుట సీత యచటె నుండ
గలదనిత లచి ఆ యశో కవనికి జనె
శోక మూర్తి కోమల గాత్రి శోభ తరిగి
దీన వదన । జీర్ణ వసన దాను జూసె ॥

198. తే.గీ. కొమ్మ మాటున దాగి యా కొమ్మ గాంచి
కలత చెందిన మనసున కపివరుండు
జానకమ్మనుచు తలచి జాలి పడుచు
వేచి యుండె జరుగునిది చూచుటకును

299. రాక్షసేంద్రుడు నాడంబరముగ భటుల
గూడివచ్చి యాయబలను గ్రుచ్చి చూసి
పట్టుదలగాను దర్పమ్ము పలుకసాగె
తన్ను వరియింప తరుణికి తప్పదనుచు ॥

200. తే.గీ. దీర్ఘ కాయు వైఖరి యాసు దీర్ఘ వా(క్ప
వాహము నరికట్ట నతివ దేహమందు
శక్తి లేకున్న తన పతి శక్తి తెలిపి
తన్ను రాముడు రక్షించు తప్పకనియె ॥

201 తే.గీ. దానవ। తెలుసుకో నీవు దాశరథికి
తృణసమానుడవనె నామె తృణము జూపి
రోషము నెఱుపెక్కుకనుల దూషణముల
రాముసతిని వేధించెను రావణుండు ॥

202. తే.గీ. ఓ నిశాచరపతి విను మొక్కమాట
రాఘవుడు నేను నొక్కటే ప్రాణము సుమ
ఇనకులేశుడు నేనును ఇనుడు - కాంతి
తాను లేని నేనును లేను ఔను నిజము ॥

203. తే.గీ. రాఘవుడు మహోన్నత వృక్ష రాజమైన
భూరుహము నల్లుకొను లత భూసుతయగు
నీరదము రాముడైనచో నీరు సీత
ఇర్వురను వేరు చేయలే రెవ్వరెపుడు ॥

204. తే.గీ. రామలక్ష్మణుల్ రాగనె రాజ్యలక్ష్మి
పోవు నీసంతునీ సుతుల్ పోవు నీదు
బలగము నశించు పోరున బాముల బడ
నేల రావణా ! యని చెప్పె నెలత మరియు ॥

205. తే.గీ. అసురవనితల నడుమనా అవనిజాత
నంత గమనించి నసురుని వంత పాడు
వారినంత మొందించగా వలె నటంచు
క్రోధమున వాయు సుతుడును కోరెనపుడు ॥



206. తే.గీ. ప్రభువు రఘు రామునకు సీత ప్రాణ ప్రదము
పతియె దైవము సీతకు హితము మతము
సర్వమును రామ మయమె యీ సతికి ధన్య
దైతి రామ చంద్రుని ధర్మ పత్ని జూసి ॥

207. తే.గీ. జలధియు, నలయు రాముడు జనక జాత
అగ్నియున్ జ్వాల రాముడు నవని సుతయు
పూవు తావి రాముడును భూ పుత్రి యనగ
హనుమ సీతను రాముని మనముదలచె ॥

208. తే.గీ. ఆవంతయును కూడ అనుమాన మిక లేదు
శ్రీరాముని సతి యా సీత యౌను
పట్టణ మానంద పారవశ్యము దేల
వనము నీ బేల యవనిజె యౌను
వదన మఱయ దోచు మది నీమెయే యామె
మాయమ్మ జానికమ్మగును ఔను
ఆశగా జూచుచు హనుమ చుట్టు తిరిగి
తప్పక మిథిలేశు తనయె యౌను

తే.గీ. అని తలచి తాను రామదూతనని తెలుప
రామ సంకీర్తనము జేసె రమ్యముగను
పోవునట్టి ప్రాణమ్ము రాబోయినట్లు
అమృతోపమానంబయ్యె అవని సుతకు ॥

209. తే.గీ. అమ్మ। రాముని ఇల్లాలివమ్మ నీవు
మా జనని జగన్మాత ! నమస్కరింతు
నమ్మ ! యీకపిందయ జూడవమ్మ యనుచు
హనుమ దరి జేరగనె సీత హడలిపోయె ॥

210. వేష భాషలు మార్చి వేవేగ వచ్చె
కామ రూపియై నట్టి రక్కసుడు వీడు
మాయ మాటల మోసమ్ము చేయ వచ్చె
అనుచు మది సంశయించెను అవని జాత ॥

211. అమ్మ ! రామబంటును నేను నమ్మవమ్మ !
అంగుళీయకం బిచ్చి పంపంగదెచ్చి
తమ్మ ! గైకొమ్మనుచు నిచ్చె తలను వంచి
అందుకొని సీత యానంద మందె కొంత ॥

212. హనుమ యిచ్చిన ముద్రికను కనులకద్ది
కరము నుంగర మునుబట్టి కరము దుఃఖ
పడచు జానకి లోలోన పతిని దలచి
తన్మయత్వము బొందెను తరుణి మరియు ॥

213. నెమ్మదిన్ సీత నమ్ముచు నెమ్మదిగను
రామలక్ష్మణులను గూర్చి సేమమడిగె
సాగర తరణమ్ము కపికి సాధ్యమేన
యనుచు వింతగ జూసెను హనుమ వైపు ॥

214. తే.గీ. వాయుసుతుడంత తన చిన్న వానరావ
తారమును వీడి ఘన పర్వత పరిమాణ
కాయ మున కనిపించిన క్షణము లోనె
హనుమ సామర్థ్యమునకామె హర్షమందె ॥



215. సీ. జాడ తెలియకను జాగు చేసెను గాని
ఇనకులేశుడు వచ్చు నిప్పు డింక
వరుస వందలు వేలు వానర సైన్యము
రామ ప్రభువునకు ప్రాణమిచ్చు
రావణాసురు జంప రణమందుదుము కంగ
స్థిర చిత్తమున వారు సిద్ధమైరి
మైథిలి ! రాగల మమ్మ శీఘ్రముగను
కాలము ధైర్యమ్ము గడుపుమమ్మ
తే.గీ. నీయునికి నెఱిగిన రాముని మది పొంగు
ఏమి కబురు చెప్పమనెదవేమి యిత్తు
వీవు గురుతుగా । నంచనె వినయముగను
సీత చూడామణి హనుమ చేత నుంచె

216. సీ. అన్న పానీయము లన్ని వదలి యుంటి
రాకాసి మూకల రక్షణమున
దిన దిన గండమ్ము దినమొక యుగముగ
పతి వచ్చునని యాశ పడుచు నుంటి
ఎదురు తెన్నులు చూసి యెదడస్సి యుంటిని
మన జాల నాథునే మనగ జాల
కాకాసురు దరిమి కన్నును దురిమిన
రామభద్రుడి పుడు రాడదేమి ?
తే.గీ. చెలియ నీరీతి దైత్యుడు చెఱను బట్ట
శిక్ష వేయక నేల నుపేక్ష చేసె ?
ఇక్కడీ రక్కసులు పెట్టు యిక్కటులను
దుష్టదనుజేశు । గూర్చిముందుగనె చెప్పు ॥

217. తే.గీ. కుశలమేన ? దాశరథులకు ? అడిగితని
చెప్పు లంకకు త్వరితమ్ము చేరవచ్చి
చెఱను విడిపించి గొనిపోవ చెప్పు హనుమ
వేగ రాకున్న నేనింక వేగలేను ॥

218. పరితపించుచు సీతమ్మ పలికినంత
పావని ప్రణమిల్లుచు బదులు పలికె
రామ సుగ్రీవులకు మైత్రి రాజి లంగ
నీ చెర విడిపించు నిదియె నిజమునమ్ము ॥

219. రాముడసమాన వీరుడు ! స్వామి మిమ్ము
గావరాకేమి ? తల్లి ! యింక నెల లోపె
లంక తేనిని జంపును శంక వీడు
ఊరడించెను హనుమయా యుర్వి సుతను ॥

220. కం. కష్టపడి వచ్చి యుంటివి
ఇష్టము వచ్చిన విధంబు నిచ్చట నుండన్
నష్టము వాటిల వచ్చును
భ్రష్టులు దనుజుల నిసీత భయముగ నుడివెన్ ॥

221. తే.గీ. భయము వలదమ్మ ! రాముని దయను యెంద !
రేకమైవచ్చి పోరి యనేక మాయ
లాడినను । దరి మెదను । వాలమ్ము చేత
ఇంక సెలవిమ్ము జయమగు నింక నీకు ॥

222. తే.గీ. ఆనుపానులు కనిబెట్ట తానుముందు
కురికె నూతనో త్సాహము ఉరక లెత్త
వనము సృష్టించె భీభత్స మనగ హనుమ
రాక్షసులు చెప్పి రంతయు రాజునకును ॥



223. కపివరుని యాగడము నరికట్ట నెంచి
తలపడిన రక్కసుల నెల్ల తలలు నరికె
అక్షయ కుమార జంబుమాల్యాది ఘనులు
మారుతిని జంప వచ్చియు మడిసిరపుడు ॥

224. వానరముగ వచ్చిన చిన్న దానవారి
మట్టు బెట్ట నింద్ర జితుడు పట్టు బట్టి
పోరి వేసె బ్రహ్మాస్త్రమ్ము కోరి కట్టు
బడెను మారుతి రావణు బలము నఱయ ॥

225. కట్టి తెచ్చిన కపి వరునట్టె జూసి
శంకరుని కింకరుడ? యను శంకతోను
నీవెవరు ? యేల నిటవచ్చినావు ? నిన్ను
ఎవరు పంపిరనుచు దాన వేశుడడిగె ॥

226. సీ. ఇంద్ర సభ నలదే వేంద్రుని మించియు
లంకేశుడు సభ నలంకరించె
రాజశ్రీ నేలగ రత్న సింహాసన
మ్మునను మణి మకుటమ్మును ధరించె
రాక్షసేంద్రుని జూడ రావణ బ్రహ్మయా
అను విస్మయమ్మున హనుమనుంచె
పరదారలను గోరు పాడు బుద్ధి యొకటె
లోపమ్ము । హనుమ లోలోననెంచె

తే.గీ. తఱచి దశకంఠు వింతైన తలలు జూసి
ఒక్క తలయైన చెప్పదే యొక్క మాట
తల్లి వలె పరస్త్రీలను తలచ మంచు
చింతిలె హనుమ రావణు చెంత నిలిచి ॥



ఆంజనేయుని బంధించిన లంకేశ్వరుడు



227. సీ. రామ దూత హనుమన్ రాజు సుగ్రీవుడు
పంప వచ్చితి రామ పత్ని జూడ
చిన్న వానరమునై చిక్కితి సులువుగ
నీ డాబు దర్పమ్ము నిను జూడ
కామాంధుడ వగుచు కన్ను గానక నీవు
జానకిం చెఱబట్ట జూడ జూడ
విధిగ మా తల్లిని వీడ కున్నను చేటు
తప్పదని హితము చెప్పి జూడ

తే.గీ. లంక నేనరు దెంచితి నింక జాగు
సేయకను రావణా। సాధ్వి సీత నప్ప
చెప్పు వంశనాశనమును చేయబోకు
దైత్యరాజ ! చేసిన తప్పు దిద్దు కొమ్ము ॥

228. తే.గీ. అనిల సుతు బోధ అగ్నిలో ఆజ్యమట్లు
రావణా సురు క్రోధాగ్ని రగుల జేసె
ఆనతిచ్చెను సుతులకు అనుజులకును
తక్షణమ్ము వానరవధ తప్పదనుచు ॥

229. సభను విజ్ఞుండు యా విభీషణుడు భక్తి
పరుడు రావణాసురుని సోదరుడు నుడివె
దూతను వధింప నీతికాదు వినుమన్న
తగిన శిక్షను విధియింప తగును రాజ ॥

230. దౌత్యమని వచ్చి నగరిలో దైత్య తతిని
మట్టు బెట్ట నేరంబెకాబట్టి యిపుడె
వానరములకు ముఖ్యమ్ము వాల మౌను
దాని నంటించ మని చెప్పె దనుజ విభుడు ॥






231. ఆ.వె. వాయు సుతుని వద్ద వచ్చి చేరిరి యంత
జేని యాజ్ఞననుసరించి వారు
సాహసించి హనుమ సామాన్య కపియంచు
నిప్పు పెట్టసాగె నెమ్మదిగను ॥

232. సీ. రాజునాజ్ఞను బొంది రాక్షసుల్ మారుతి
తోక నందుకొనిరి తోడు గొనుచు
నిర్భయంబుగ వారు నిప్పు పెట్టంగను
పెద్దగ వాలమున్ బెనిచె హనుమ
ఆ వింత తిలకించి యాశ్చర్య పడివారు
అఱచుచు నుండగ నాగ్రహించి
చిందులు త్రొక్కుచు ఎందుచూచిన నందె
కాల్చ నెంచెను లంక కపివరుండు

తే.గీ. కోడిగమ్మున కొందఱాట్లాడు చుండ
కుప్పి గంతులు వేసెను కుపితుడయ్యు
పగను వారిండ్లు దగ్ధమై పాడుబడగ
వాలమును కోరి యంటించె వరుసగాను ॥

233. నగరమంతయు ననలుడు నాకివేయ
కోటికి పడగెత్తిన వారు కోలుపోయి
సర్వమును మునిగిరి దుఃఖ సాగరమున
దిక్కు తోచక నుండిరి దిగులు పడుచు ॥

234. తనదు దౌత్యము చూసిరమ్మన్న కాల్చి
వచ్చినట్లుగనై సీత వనము నందు
అగ్ని కాహుతైనది యేమొ ననుచు హనుమ
తరలె నాయ శోక వనికి తల్లి జూడ ॥

235. శోక మూర్తి యా సీత యశోక వనిని
మంటలంటక కుశలయై కంటబడగ
కైట బారికికై మోడ్పు లటనె చెప్పి
మాత ! శలవంచు మారుతి మరలెనపుడు ॥






236.ఆ.వె. వచ్చి నట్టి పనికి వరుస విజయమునై
సాధ్వి సీత గనగ సాధ్య పడగ
రాము జేర వెడలె రయమున తృప్తిగ
పావని కడు భక్తి భావమునను ॥

237. సీ. గిరిశిఖరముపై నెగిరి యాంజనేయుండు
గగనమ్మున నగమై గానవచ్చె
వాయు వేగమ్మున వాయు నందనుడేగి
తొలుత మైనాకునిబలుకరించె
మాహేంద్ర గిరి జేరి మానసోల్లాసంబు
సింహనాదమును సేయవచ్చె
జయ జయ ధ్వనులంచు జాంబవంతుడు హన్మ
తిరిగి రాకను గూర్చి తెలియపర్చె

తే.గీ. కన్నులార హనుమజూసి కపులు వీను
లార వినగ నా వివరము లడుగగాను
కలకలమ్మున వచ్చిరి కలసి మరియు
పరుగు లిడుచు నుత్సాహము పట్టలేక ॥

238. చుట్టు ముట్టిన మిత్రుల జూచి హనుమ
తల్లి నా లంకలో జూచి ధన్యుడైతి
యనగ హర్షాతిరేకమ్ము మునిగి వారు
గోల చేసిరి ప్రశ్నలు కొసరి యడిగి ॥

239. వెడలినావెట్లు ఎందెందు వెదకినావు ?
ఏమి చేసితివి హనుమ ? ఏమి యుండె ?
లంకలో తిరుగను జంకు గొంకనుకను
ఎక్కడ కనుగొంటివి తల్లి ఎటుల నుండె ? ॥

240. మింటి కెగిరి కడలి దాటి గంటి ! లంక
జేరి లంకిణిం జంపితి కోరి దాన
వేశునకు బుద్ధి చెప్పితి వేగ నగరు
కాల్చి యేడ్పించి వచ్చితి కక్ష తీఱ ॥

241. వానరులును నుత్సవంబున వనము జేరి
సంతసంబు యథేచ్ఛగ సంచరించి
రామ సుగ్రీవులకు జెప్పి రావలెనని
బయలు దేరిరి వారంత పరుగు లిడుచు ॥

242. దాశరథి సతీ విరహమ్ము దానవేశు
పైన కినుక పెరిగి తనపైన తానె
అలిగి విసుగుతో కొంచెము ఆశతోను
నెదురు చూచు సమయమందు నేగె హనుమ ॥

243. కంటి మా తల్లి గంటి లంకను యశోక
వనిని శోకతప్త హృదయినిని । గంటి
సత్వరము పోవలెను తండ్రి సతిని గావ
విన్నవించెను హనుమయు వివరముగను ॥

244. ఆదరమ్మున దశరథుడా ధరణిజ
కిచ్చిన దనుచు యానవా లిచ్చినట్టి
ఆభరణము చూడామణి నమిత భక్తి
హనుమ అందించె రామచంద్రునకు నపుడు ॥

245. భక్తితో నతి శ్రద్ధగా పావనియును
రావణుని గూర్చి వివరించె రామునకును
అంజలి ఘటించి యాస్వామి యాజ్ఞ కొఱకు
వేచియుండెను హనుమయు వినయముగను ॥



246. సీ. చూడామణిని చూసి సూర్య వంశజుడును
భార్యకై వ్యాకుల భరితుడయ్యె
కలకంఠి చెప్పిన గతమంత తీయగా
వినిపించ రాముడు వివశుడయ్యె
అలసిన పాలతికి తిలకము దిద్దుట
వరుసగ విని దీనవదనుడయ్యె
కాకాసురు కథను కాకుత్సు తలచియు
నిస్పృహను సజల నేత్రుడయ్యె

తే.గీ. మైథిలి కుశలమ్ము మధురమైన యామె
మాటలను మనోభావమ్ము మమత తెలుప
పరిధి లేని సంతోషము పట్టలేక
హన్మ నాలింగనము చేసి ఆదరించె ॥

247. తే.గీ. శీఘ్రమే రాము డనికితా సిద్ధమనియు
తరుణ మాసన్న మాయెను తరచి చూడ
యుద్ధ సన్నాహములు చేయ నురుకు మనుచు
వానరేంద్రుని లక్ష్మణున్ వడిగ బంపె ॥

248. రామలక్ష్మణులును కపిరాజు కలసి
దండయాత్రకు వానర దండు నంత
పోరు సలుపంగ చెప్పిరి పేరు పేరు
కలిగె నుత్సాహము కపుల కధికముగను ॥

249. సుందరాకాండ పఠనంబునందు కలుగు
ఆయురారోగ్య భాగ్యముల్ అందరికిని
విన్నవారును పొందుదు రన్న నిజము
రామునే నమ్ముకున్నచో రక్ష కలుగు ॥

# యుద్ధ కాండ

250. సీ. కపిదండు లంకకు కదిలింది ముందుకు
ఉత్తర ఫల్గుణీ ఉదయ మందు
విజయమ్ము సిద్ధించు విధిగ మనకనుచు
ఉత్సాహమున సేన యుద్యమించె
రామలక్ష్మణ కపిరాజులు నడచిరి
సేనకు మధ్యన శ్రేయమనుచు
కానలోన కపులు కాలిబాటను వేసి
సుగమంబు చేసిరి సులువుగాను

తే.గీ. చెట్లు చేమల నెక్కుచు సేకరించి
మధుర ఫలములు భుజియించి మనసు తీర
శీత లోదకమ్ములతోను సేదతీరి
తీరికగ జనిరి కడలి తీరమునకు ॥

251. సీ. ఉదధిని ప్రార్థించ నుర్విజాపతికిని
సామమున్ సగరుడు సడల లేదు
దానమన్న బలుక డా రత్న గర్భుండు
బేధ మన్నను కూడ బెదర లేదు
దండనకును బూనె దాశరథి యపుడు
దిగివచ్చె వార్నిధి తిరుగులేక
అంజలించియు నేమి యాజ్ఞ రామా యనె
ఆ వినయాంబుధి కవధి లేదు

తే. అంతులేని పయోనిధి నధిగమించ
సాయ మర్థించె రాముడు సగరు నపుడు
సవినయమ్మున మ్రొక్కుచు సాగరుండు
వారధిని కట్టు మని చెప్పె వార్థియపుడు ॥



252. ఆత్మ విశ్వాసికి నసాధ్య మసలు లేదు
నీలుని వరమున శిలలు నీట తేలు
కడలిపైన వంతెన కట్ట గలరు మీరు
ఆనతిమ్ము కపుల కంచు తానె చెప్పె ॥

253. కపులు రామ ప్రభువు నాజ్ఞ కడలిపైన
శిలలు వృక్షముల్ తెచ్చివేసిరి వరుసగ
తేలె నలలపై బంతులవోలె నవియు
వారధి వెలసె నంతట వారిధినియు ॥

254. నూరు యోజన మ్ములగు సుదూరమంత
సాగర తలము నక్కట సరిగ వారు
ఐదు దినములె కట్టిరి కుదురు గాను
విజయ పథగాములై పోర వీరులంత

255.తే.గీ. తమరి కష్టమ్మునకు కల్గె తగిన ఫలము
శంక లేదింక చేరంగ లంక కంచు
బారులుగతీరి వానరుల్ బయలుదేరె
సంతసమ్మున వారంత గంతులేసె ॥

256. సాగర తటమ్ము రాముడు సతిని దలచి
దైత్యు లెంత వేధించిరో దయను మాలి
దుర్విధియె జేసె నిను నన్ను దూరమిట్లు
తనకు తానె దుఃఖించెను తపన పడుచు ॥

257. క్ష్మాసుతా । జాగు జేసితి క్షమను వేడు
కొందు । నినుగానక దిగులుకొంటి యిన్ని
దినములును పట్టె । నీయున్కి తెలియుటకును
విన్నున । శశియె । యోదార్చు । నిన్ను । నన్ను ॥

262. తే.గీ. ఆయన సతిని సీతమ్మ నపహరించి
తప్పు చేసినందుకు శిక్ష తప్పదయ్యా
వానర బలగమ్మును గొనివచ్చి కక్ష
తీర్చుకొనుట తథ్యము సుమ్మ తెలిసిగొనుము ॥

263. అతని మాటల రావణుం డదిరి పడుచు
నన్ననుసరించు వారౌను నాకు హితులు
నీవు శత్రు పక్షమనియు నేడె తెలిసె
అక్కసుగను దూషించె యనుజు నతడు ॥

264. మంచి మాటలు చెప్పిన మనసు కెక్క
దింక చేటు కాలము వచ్చె నింకనీకు
శరణు వేడెద రాముని చరణములనె
యనుచు సభను వీడెను విభీషణుడు విసిగి ॥

265. వైరి పక్షమ్ము వారిని । వదలరాదు
నమ్మరాదు రాఘవ ! యది నటనె యగును
ఇచ్చ కములాడి చేర్చును యిచ్చ వచ్చి
నట్లు యిచ్చటి వన్నియు నచ్చటకును ॥

266. చెప్పసాగె సుగ్రీవుడు చెడును ముందు
తలచి కపులంత తందాన తానయనుచు
వంత పాడిరి । రాజుకు । కొంతమేర
చిన్నగా నవ్వె రాముడు చిత్రముగను ॥

267. రాము డాశ్రిత జనులను రక్ష సేయు
శరణమన్నచో క్షమియించు శత్రువైన
ఆ విభీషణు డార్తిగ నరుగుదెంచ
అభయ హస్తమ్ము నిచ్చుచు నాదరించె ॥



268. యుద్ధమును జేయుటకు నేను సిద్ధమయ్య
భక్తితో సాయపడుదు నా శక్తి కొలది
అని విభీషణుండు తెలుప హర్షమంది
రాము డభిషేకమును జేసి రాజు జేసె

269. తే.గీ. సాధ్వి నర్పించు రాముని సంధి గోరి
రాజ ! వానర బలగమ్ము రాము శక్తి
శరణు బొందిన యావిభీ షణుని జూసి
చారులు శుక సారుణులంత చాలజెప్పె ॥

270.తే.గీ. హితము చెవికెక్కలేదు యింగితము లేదు
ఎల్లర తిరస్కరించుచు కలను గూడ
మైథిలిని వీడనని తేడు మిత్తి కోర
సిద్ధ మైనవాడు విధి వంచితుడు కాదె ॥

271.తే.గీ. నచ్చ చెప్పిన కొలదియు రెచ్చిపోయి
పృథ్వి పుత్రిపై మోహమ్ము వృద్ధి చెంది ।
ఇంద్ర జాలమ్ము చేయగ నిందుముఖిని
అడ్డదారిని త్రొక్కె నా యసుర తేడు ॥

272. మాయచేసెనపుడు మంత్ర మహిమ చేత
రాము శిరము శరము జూపి రావణుండు
నెలత ! తెలుసు కొమ్మిక । నీకు నేనెదిక్కు
నన్ను పెండ్లాడకను తప్ప దనియు చెప్పె ॥

273. పరితపించుచు । భూసుత పతిని దలచి
నేబ్రతుక జాల మిము వీడి నిజము రామ ।
నన్ను గూడ చంపుము రావణా ! యనుచును
మూర్ఛ నొందె నా సాధ్వి యప్పుడమిపైన ॥

274. తెలివి తప్పి పడిన యామె తీరు జూసి
దానవేశుడు తన దారి తాను బోయె
అవ్విభీషణు సతి తెల్పి యసుర మాయ
నూరిపోసి ధైర్యము సీత నూరడించె ॥

275. రాయబారి నంగదు పంపె రాముడంత
రావణా ! సీత నిచ్చి శరణము వేడు
వినకపోయిన శిక్షించు విధిగ నిన్ను
నాశనము జేయు నట రఘు నాథు శరము ॥

276. దాశరథి మాటలను జెప్పి దానవేంద్రు
ఉగ్రరూపమ్ము తిలకించి యులికి పడక
నిబ్బరముగ నంగదుడును నిలిచి యుండ
కృద్ధుడై ఱేడు అరచెను క్రూరముగను ॥

277. ఆ కపి పలుకుల్ ములుకులై యసుర వరుడు
సంధికిని సమ్మతించక సమరమనుచు
స్థిరముగా నంగదుకు చెప్పె సిద్ధ పడుచు
వాని నప్పుడె బంధించ నానతిచ్చె ॥

278. తనను బంధించ వచ్చిన దానవులను
చిత్తమున తోచు రీతిగ చిత్తు చేసి
ముప్పు తిప్పలు పెట్టి యమూల్యమైన
భవన శిఖరమ్ము పడగొట్టి బయట పడియె ॥

279. కపులను కపిరాజునుగని యంగదుడు చెప్పె
రాక్షసేంద్రుని రణభేరి రామచంద్ర ।
సత్వరమ్మె వినగలము సత్య మిదియె
విన్నవించె నెల్లరకును విశదముగను ॥



280. అనుమతించుము రాఘవా అరిని దునుమ
అసురులను జంప వానరుల్ అధికముగను
కోరుచుంటి రుత్సాహమ్ము గొనియుననగ
జైత్ర యాత్ర కానతినిచ్చె జైత్రయపుడు ॥

281.తే.గీ. వానరు లని జేయగ రాము డాన తీయ
కదన రంగమునకు వారు కదలిరపుడు
ప్రభువునకు యుద్ధమున తమ ప్రజ్ఞ జూప
ఒకరికంటెను మించి మరొకరు నెంచె ॥

282. సీ. రాక్షసులు కపులు రణరంగ మందున
పోరు భీకరముగ పోరుచుండె
కత్తులు శరములు కరములన్ దనుజులు
చెట్లు బండల కపుల్ చెలగుచుండె
మాయల యుద్ధము చేయగ దైత్యులు
దైవ బల్మి కపులు దరుము చుండె
వైరుల జంపగ వారు పోటీలను
పడి తమ ప్రాణమ్ము లడ్డు చుండె

తే.గీ. ఘోర యుద్ధము జేసిరి వార లంత
సైన్య మంతయు తరుగుట సైచ లేక
తమ్ముల తనయు లెల్లరన్ దరిమె యుద్ధ
మున క దానవేశుడు పంతమునకు పోయి ॥

283. నీల నల మైంద హనుమాది నిపుణులంత
అంగదుడు జాంబవంతాది యంగ బలము
దనుజులను తమ శౌర్యంబు దునుమ మెచ్చి
అర్క సుతు డంత వారిని యాదరించె ॥

284. ఇంద్రజిత్తు డదృశ్యమై యినకులులను
ఎక్కుపెట్టె నాగాస్త్రమ్ము నొక్కసారి
దశరథు సుతులకు స్మృతి తప్పినంత
వారినిం జూసి విలపించె వానరులును ॥

285.ఆ.వె. కదన రంగ మందు కదలిక లేకుండ
భూతలమ్ము మూర్ఛ నొంది యున్న
దాశరథుల జూచి దానవులనసాగె
విగత జీవులైరి విధిగ వీరు ॥

286.తే.గీ. అసువులను బాసె రాముడు, అనుజుడంచు
తనయు డెరిగించె తండ్రికి త్వరితగతిని
ఇంద్రజిత్తును పొగడెను యింద్రుడనుచు
చంద్రుడనుచు నా రావణ చక్రవర్తి ॥

287. రామ లక్ష్మణులను జూడ రావణుండు
సీతకు త్రిజటను తోడు శీఘ్ర మంపె
పతి విగత జీవుడని నమ్మి పాప మామె
శోక సాగరమ్మున మున్గి సోలిపోయె ॥

288. ఆ వదనముల వెలుగొందు జీవకళను
కనుము ! అది నీదు భాగ్యమే వినుము తల్లి
పుడమి నవతరించిన సామి పుణ్యమూర్తి
ధరణి భారము తొలగించు దైవమమ్మ ॥

289. ఊరడించెను త్రిజటయు నుర్విసుతను
దైన్యమును వీడి జానకి ధైర్యముగను
రక్త ధారల డస్సిన రాముజూసి
వేడె దేవుని పతి గావవే యనుచును ॥

290. పిలిచినట్లు పక్షీంద్రుడు నిలిచె వచ్చి
తన కరమ్ముల వారిని తాక గానె
రామ లక్ష్మణుల్ కనులు తెఱచి గరుడుని
ఆగమనమును పొగిడిరి ఆదరమున ॥



291. స్వస్థతను బొంది రెట్టింపు శక్తి కలిగె
ఇనకుల తిలకులుత్సాహ మినుమడించ
వైరి సంహారమే ధ్యేయ మౌర యనగ
విడిచిరి శర పరంపర విడువకుండ ॥

292. ప్రాణములను తెగించుచు ప్రాకులాడ
పోరు ఘోరమై దానవ వీరులంత
కనులు మూయ రావణుడు తక్షణమె కుంభ
కర్ణుని రణరంగము దూక కబురు పంపె ॥

293.తే.గీ. కుంభ కర్ణుని మేల్కొల్ప కూడిరంత
రక్త భాండమ్ములను మాంస రాసు లటకు
లెక్కలేనన్ని తెచ్చియు నొక్కసారి
లెమ్ము లెమ్మని కుమ్మినా వమ్ము పోయె ॥

294. ఏనుగుల చేత తొక్కించ నేమిగాక
చెవుల బాకాలు నూదిన చెదరకున్న
బల్లెముల పొడువగ నొత్తిగిల్లె నపుడు
భటులు రాజాజ్ఞ విన్నవింపగను సాగె ॥

295. సీ. కునుకు చాలును లెమ్ము కుంభ కర్ణ సమయ
మికలేదు తక్షణ మికను రమ్ము
బలహీనపడె సేన బలవంతు లందరు
నిర్యాణమందిరి నిద్ర లెమ్ము
రణరంగమందున రామునకును సాటి
నీ కంటె లేరయ్య నిజము నమ్ము
నా యండ నీ వుండినా వయ్య సోదరా
అని చెప్పమని పంపె, ప్రభువు మమ్ము ॥



లక్ష్మణ మూర్ఛ



తే.గీ. వీర మరణమ్ము నొందిరి వీరులంత ।
కుంభ కర్ణ నీ చేయి లేకుండ శత్రు
బలగమును గూల్చ సాధ్యమే ? బయలు దేరు
వారి నోడించి సాధించవలెను జయము ॥

296.తే.గీ. ప్రభువు నాజ్ఞను వెడలెను ప్రతిభ జూప
కుంభ కర్ణుండు యలుపు లేకుండ పోరి
నిహతుడయ్యెను శ్రీరాము నిశిత శరము
అంతరించి రధిక శాత మసురవరులు ॥

297. యోధు లందరు వరుస నయోధ్య రాము
శరము లను గూల నింద్రజిత్ శరములన్ని
వరుస కురిపించె కపులపై వర్షమల్లె
పోరు భీకరమై సాగె జోరుగాను ॥

298. హనుమదాదులు సౌమిత్రి యంగదుడును
చిత్తు చేసిరంతట నింద్రజిత్తు మాయ
భక్తి గనువేసి నా గాస్త్ర శక్తి జూపె
ఇంద్రజిత్తు సౌమిత్రిని క్రింద గూల్చి ॥

299. సీ. మూర్ఛ మునిగిన తమ్ముని । ముందు కూర్చుని
దురపిల్లె రాముడు దుర్భరముగ
ప్రాణ రక్షణకు నుపాయమే మున్నది
సోదరా । యనికుందె శోకమునను
అర్ధాంగిని వదలి అడవికి నన్నుతో
వచ్చితి విట్లు నే వగచుటకున ?
స్మృతి లేని నినుచూసి మతి దప్పు నా కంచు
పరితపించెను దుఃఖ భారమునను






తే.గీ. రామ చంద్రుడీ రీతి విరామ మిడక
వగచు చుండ సం జీవి దివ్యౌషధమ్ము
హనుమ నంపి తెప్పించుమయ్య యని చెప్పి
వైద్యుడు సుషేణుడా రాము వెతను దీర్చె

300. రాము నాజ్ఞ వాయుసుతుడు రయము బోయి
పట్టి తెచ్చె సంజీవినీ పర్వతమునె
అంబుధారల రాముడు అనుజుడనుచు
హనుమ నాలింగనము జేసుకొనియె నపుడు ॥

301. ఔషధమహిమన్ సౌమిత్రి ఔర యనగ
కనులు తెఱచి తటాలున కరము నస్త్ర
ములను సంధించి యింద్రజిత్ తలను ద్రుంచె
కడలి హోరును మించెను కపుల జోరు ॥

302. తన బలగమంత నశియించి తాను మిగిలె
రావణుండు రోషంబుగ రాము జేరి
కదనమునకు తానె దిగుచు కాలు దువ్వె
పెరుగ పంత మిరువురకు పెరిగె పోరు ॥

303. కసిగ దశకంఠు డురికెసంగ్రామ మందు
దాశరథి శర వర్షంబు దాడి చేసె
రామ బాణాల ధాటికా రావణుండు
తట్టుకొనలేక వెనుకకు తరలి వెడలె ॥

304.సీ. అరుదెంచె లంకేశు డష్టాశ్వ రథమున
రణభూమి యదరంగ రక్కసులతొ
దేవేంద్రుడంపిన దేవ రథము నెక్కి
శోభించె నిన వంశ శూరుడెంతొ
యుద్ధ నైపుణి జూప యోధు లిద్దరు గూడ
ఒకరిని మించె యింకొకరు నెంతొ
అస్త్ర ప్రయోగంబు ఆరితేరిన వారి
సంకుల సమరమ్ము సాగె నెంతొ

తే.గీ. రామ రావణ యుద్ధమ్మరయుచు సురలు
దేవ దానవ యుద్ధమ్మిది యనుచుండ
మంచి-చెడు మధ్య పోరాట మంచు నరులు
జయము । శ్రీరామ । నీదేవి జయము ననిరి ॥

305. పది తలల వాని పరిమార్చు పవిత్ర మంత్ర
మిదియె 'ఆదిత్య హృదయము' మది జపమ్ము
జేయమనియె నగస్త్యుండు జయము కొఱకు
శ్రద్ధగా రాముడు పఠించ సాగె నపుడు ॥

306. మంత్ర శక్తితో భంధనమందు తాను
తిరిగి వచ్చిన లంకేశు దిరిగి రాని
లోకములకు పంపించగ నేక బిగిని
తీసి బ్రహ్మాస్త్రమును వేసె తిరుగులేక ॥

307. దానవేశుడా బ్రహ్మాస్త్ర ధాటికాగ
లేక పోరాటము సలుపలేక నలసి
సీత గూర్చి పశ్చాత్తాప చిత్తుడయ్యి
హరియె రాముడనుచు బాసె యసువు లతడు ॥



308. రావణ వథయు, లంకలో రాక్షసులను
శత్రు సంహారమును జేసి మిత్రుని యవ్వి
భీషణుని రాజు జేసి సంతోష మంది
రమణి చెఱ విడిపించగా రాముడరిగె ॥

309. రాజునే జేసితివి । లంక రాజ్యమునకు
నాదు ప్రార్థనన్ । రావలె నగరమునకు
అని విభీషణు డనినంత తనకు దీక్ష
ఉన్నదని లక్ష్మణుని పంపె నినకులుండు ॥

310. అవ్విభీషణ ప్రభువు వైభవము జూడ
అన్న యానతిన్ సౌమిత్రి యనుసరించె
రామ భక్తుడైన నిశాచరాధిపు గని
మోదమున దైత్యు లంద రామోదమనిరి ॥

311. అన్న కర్మకాండలనున్న । యన్నదాన
వస్త్ర దానమ్ములకు । పురవాసులన్న
మాట । అన్న కన్నను మిన్న బాట గన్న
అనుజుడని । విన్న రామన్న । హర్షమందె ॥

312. కం. రాజాజ్ఞ గైకొనియటకు
నాజానకి । దెమ్మనంచు । నారాముడనన్
యేజాగు లేకను । పతిని
తాజూడదలచె నటంచు । ధరణిజ కోరెన్ ॥

313.తే.గీ. ఎదను పతిని నిలుపుకొని ఎదురు జూసి
మనసు మధుర స్మృతులతోను మరులుగొనగ
పరుగు నేతెంచె మైథిలి పతిని జూడ
కనుల నడిగె కుశలమేన ? యనుచుపతిని ॥






314. సతిని కడు ఆర్ద్రతన్ మనసార జూచి
రమణి అగ్ని పరీక్షకు రాముడాన
తిచ్చినంత లక్ష్మణుడు చింతిల్లి చితిని
సిద్ధపఱచెను లోలోన సిగ్గు పడుచు ॥

315. ఉ. శైలజ వాణి యజ్జనకజాతను రాముని జూడ నెంచియా
వేళకు వచ్చిరచ్చటకు వేల్పులు మౌనులు కూడ జేరగన్
జాలిగ తోచెనం దరికి జానకి నప్పుడు యగ్ని సాక్షిగా
నేలగ దల్చె రాముడన నేలకొ వింతగ తోచె నయ్యెడన్

316. కం. కరములు మోడ్చుచు జానకి
శిరమును వంచి పతి గాంచి చితిలో దూకెన్
సురముని గణములు పొగడిరి
సరసిజ నాభుడు తననిజ సతి నిల బొందెన్ ॥

317.తే.గీ. నీల కంఠుడు సురులంత మేళవించి
రమకు హరికిని ధన్యవాదమ్ము లనుచు
సాదరప్రణా మములిడ సాగినంత
శుభమనుచును దీవించి భూసురులు నపుడు ॥

318. మోహరమ్మున కన్నులు మూసినట్టి
కపుల ప్రేమతో వీక్షించి కరుణ తోడ
ప్రాణ దానమ్ము చేయంగ రాముడడిగె
అమర నాథుడున్ వారికి నాయు వొసగె ॥

319. సీ. పూత చరిత సీత పుణ్యవతి యనెను
వీతిహోత్రుడప్పుడు వేయి నోళ్ళ
నిజముగ పృధ్విలో నీ సాధ్వి యారాధ్య
దేవత యంచునె దేవతలును
ఇన వంశ గౌరవ మినుమడించెననుచు
చూసిన వారిదే సుకృతమనిరి
శ్రీరాముని ఘనత శ్రీరామ చరితమ్ము
విన్న వారికి లోక విదితమయ్యె
తే.గీ. జానకీ రాము లాదర్శ మౌను మనకు
రామచంద్రుని వంటి భర్తయు తనయుడు
సోదరునె కోరు చుందురు శోభిలంగ
వారి గొల్వగ శుభమగు నేరికైన ॥

320. సీ. ఆదుకో రామయ్య ! ఆతిథ్య మందుకో
ఆ విభీషణుడనె యాదరమున
సమయము లేదింక సరగున కోసల
జేరవలెనని రాజీవుడనగ
సిద్ధము చేయించె శీఘ్రముగను రాజు
పూవులు పఱపించి పుష్పకమును
సెలవంచు రాముడు సీతతో పయనించ
కపిరాజు సౌమిత్రి కపులు జనియె
తే.గీ. హనుమ జాంబవంతాదులు అనుసరించ
బయలుదేరిరి యుత్సాహ భరితులగుచు
తాను సీతను వెతికిన తావులన్ని
దారి పొడుగున చూపించె దాశరథియు ॥



321. తే.గీ. రాఘవుడు ముందు గను తమ రాక తెలుప
భరతు నొద్దకు పంపెను పవన సుతుని
జానకీ రాము లేతెంచు జాడ నెఱిగి
స్వాగతము చెప్ప సిద్ధమై సాగిరంత ॥

322. రావణుని సంహరించిన రామునిగన
వేచియుండి రాతురతగ వేల మంది
తపము ఫలియించె ! జన్మము ధన్యమయ్యె
పలికె హర్షాతిరేకమ్ము భరతుడపుడు ॥

323. రామ నామ సంకీర్తనన్ రాత్రి పగలు
ఋషిని బోలియుండెనతడు రూపు మారి
ప్రేమతో రాముడు కుశల మేకద యన
చరణముల వ్రాలె భక్తిగ భరతుడపుడు ॥

324. స్వాగతంబంచు నెల్లరు స్వామి జూసి
రామచంద్రుడు సీతయు రాచనగరి
వేల్పులని సంతసించియు వేడ్కగాను
పూల బాటలు వేసిరి పుణ్యమనుచు ॥

325. సీ. మ్రోడైన మానులు మోదమ్ము చిగురించె
నవవసంతుని చిరునగవు జూచి
కోలాహలమ్మున కోకిలమ్మలు తీసె
రాగాలు ప్రీతితో రాము జూచి
మండెడు గుండెల మధువులు చిలికెంచె
కురియు వర్షము రాము కరుణ జూచి
కోసల పులకించ కోర్కెలు ఫలియించె
హేమంతమై రాము హేల జూచి

తే. గీ. అవ్వసంత మాది ఋతువులారు కలసి
ఒక్కసారిగ వచ్చెనో అక్కడనగ
దైవ మరుదెంచె నేమొ యద్దివిని వీడి
నేడు మమ్మేల వచ్చె మా ఱేడు అనిరి

326. ఉ. శ్యామల వర్ణ శోభలును శౌర్యము గాంచ మనోహరమ్ముఆ
రాముని పాద సన్నిదియె ప్రాణము కంటెను మిన్నయౌను ఆ
నామ జపంబె సాధనము నాడును నేడు తరించగా జనుల్
తాము వరించి రామచరితంబును గానము చేయగావలెన్ ॥

327. తే.గీ. ఏక కంఠంబున తమరి యేలికైన
రామునే కోరి భజియించి రామభద్ర ।
రాక్షసాంతక । రక్షించు రఘుకులేశ
యనుచు రాముని ప్రార్థించి రందరపుడు ॥

328. సీ. సత్యపాలనకును సామర్థ్యమున్నట్టి
నీతి మంతుండవు నీవె గావె
కన్నతండ్రి కొఱకు కానకేగినయట్టి
నియమ పాలకుడవు నీవెగావె
ప్రజలను చక్కగ పాలించ గలయట్టి
నేతవు రఘురామ నీవెగావె
రాజ్య భారము నీది రామ । మాకున్నట్టి
నెలవుయు రక్షయు నీవెగావె

తే.గీ. నీదు రాజ్యమ్ము గైకొని నాదు కోర్కె
తీర్చి బరువు బాధ్యత కడ తేర్చవయ్య ।
అనుచు భరతుడర్థించగన్ జనులు కూడ
జానకీ రాములకు బల్కె జయము శుభము ॥



329. తే.గీ. రామ పట్టాభిషేకమ్ము రయము జరుప
శుభముహూర్తమ్ము నా వశిష్టుడును జూసె
కలకలంబు జనులు వేడుకలను జేయ
నుద్యమించిరి శీఘ్ర మయోధ్యలోన ॥

330. ప్రజల కోర్కెను దీర్చగ ప్రభువు రామ
చంద్రు డనుమతించంగను సంద్రమల్లె
పొంగె సంతోష మంతట పురము నందు
పండుగాయెను ప్రతియింట ప్రజలకపుడు ॥

331. సీ. పసుపు సున్నము కల్సి పారాణి యైనట్లు
దాంపత్య బంధమున్ ధరణి నొప్పు
పాలు నీళ్ళనువలె పలుకు లొక్కటిగాను
సోదరులను గూడి సొగసు నొప్పు
తల్లి దండ్రులయందు తనయుని ప్రేమకు
మనకిల నాదర్శ మనగ నొప్పు
అవతార మూర్తిగ ఆరాధ్య దైవమై
అవని జనావళిన్ ఆదరించు

తే.గీ. అన్న పానము లోటు లేదన్న నిజము
కష్టములు పోయి సుఖములు కలుగు నిజము
ధర్మ దేవత న్యాయమ్ము దనరు నిజము
ప్రజలు శ్రీరాముని గురించి పలుకు నిజము ॥

332. యుద్ధ కాండను చదివిన శ్రద్ధగాను
ఆయురారోగ్య భాగ్యముల్ అందగలవు
విన్నవారును పొందుదు రన్న నిజము
రామ రక్ష లభించును నమ్మియున్న ॥

333. సీ. స్వర్ణ ఘటంబుల జలధి జలము దెచ్చి
రంత మారుతి జాంబవంతు లరిగి
అభిషేకముం జేసి ఆభరణము లుంచి
చూడ సుందర రాము సొగసు పెరిగె
వేద మంత్ర పఠన వేల్పు। లాశీస్సులన్
రత్న కిరీట ధారణము జరిగె
ఆ విభీషణుడును అర్కసు తానుజుల్
వింజామరలు పట్టి వీచసాగె

తే.గీ. ఆడి పాడిరి గంధర్వు లప్సరసలు
సభను జానకీ రాముల విభవమునకు
దైవ సములుగ యెంచిరా దంపతులును
జయ జయ ధ్వనుల్ చెలరేగె జగతియంత ॥

334.తే.గీ. పసిడి సింహాస నమ్మున పత్ని సీత
పార్శ్వముల యందు తమ్ములు పాదముకడ
పావని, సభను సంతోష భరితులైన
జనము రాముని కొలువుండె ఘనముగాను ॥

335. నీలి మేఘాన తళుకు మనియెడు మెరుపు
తీగవోలె కన్పట్టె మైథిలియు సభను
శ్యామలాంగు వామాంకమ్ము కోమలాంగి
పతికి నొదిగియు తగినట్టి సతిగ నుండె ॥

336. ఇనకులేశు డిందీవరాక్షునకు జనక
తనయకు తెలిపిరి యభినందనలు చాల
రాముని విజయ గాథలు తాము తలచి
భూ సురులు సురు లంద రాశీస్సు లిడిరి ॥

337. శ్రీహరి యవతారము నెత్తె। సిరిని గూడి
అనియు, బాల ప్రాయమునాటి యాటనుండి
నేటి వఱకు। వాని గుణములు మేటి వనుచు
గొప్పగను మెచ్చుకొని చెప్పుకొనిరి। జనులు ॥



338.ఆ.వె. వరము కోరు వార్ని। వరుస చూచు। మరియు
శరణు కోరు వార్ని। శకము చూచు
రామయన్న। పాప రాహిత్య మేయగు
రామ రామ। యన। వి రామ మనక ॥

339. సీ. ఋషి కౌశికుడు కోర। ఇనకులేశుడువని
గొప్ప క్రతువుగాచి। కోర్కె దీర్చె
కానకు బొమ్మని। కైకేయి। ఆనాడు
కోరగా। వనికేగి। కోర్కె। దీర్చె
కోమలి సీతయు। కోరిన విధముగ
గొనిపోయి వెంటను। కోర్కె దీర్చె
అగ్రజు సౌమిత్రి। అనుసరించెదనని
కోరగా తమ్ముని కోర్కె। దీర్చె

తే. గూటి పడవ నెక్కమనిన। గుహుని కోర్కె
దీర్చె। వనమున తాపసుల్ దీనముగను
దనుజ సంహారమును గోర। దయను తీర్చె
కోరినంతనె। రాముడు కోర్కె దీర్చు ॥

340. సీ. అరి గూల్చ సుగ్రీవుడడిగిన చందము
కోరి వాలిని జంపి కోర్కె దీర్చె
ఏరి యెంగిలి తినకోరిన చందము
కోన భక్త శబరి కోర్కె దీర్చె
హరిని। సు రమునులు। ఆశించు చందము
ఘోర రావణు జంపి కోర్కె దీర్చె
కోసల నేలంగ కోరిన చందము
కోమలి గొనివచ్చి కోర్కె దీర్చె

తే.గీ. ఇష్టమైన రామకథను స్పష్టమగును
బాధితుల పట్ల రాముడు భాగ్యమగును
నమ్మి గొల్చిన వారికి న్యాయమగును
ధైర్యమిచ్చి జయము గూర్చు దైవమగును ॥





341. సీ. సీతా రమణ నిన్ను కీర్తనల్ గొల్చిరి
త్యాగరాజును రామ దాసు ఘనులు
భక్తిగ నర్పించె బమ్మెర పోతన
భాగవత రచనా భాగ్య నిధులు
రామాయణమ్మును రచియించె వాల్మీకి
భాస్కర తులసిదాస్ ప్రముఖ కవులు
ఎందరో పుణ్యాత్ము లందరూ ధన్యులే
శ్రీరామ శరణన్న వారమరులు

తే.గీ. రామగాథను భక్తిగ రచన చేసి
మోక్ష మెందిన కవయిత్రి మొల్ల । కల్ప
వృక్ష కవి విశ్వనాథ సహృదయులకును
వందన శత మ్ము ఆ ఘను లందరకును ॥

342.తే.గీ. రామనామ స్మరణ మందె రక్ష గలుగు
చరణముల నాశ్రయించిన శరణ మిడును
రామభక్తిచే జనులకు రగడ తొలగు
రామదేవు కథాసుథ రమ్యమగును ॥

343 'రా'యనుచు నోరు తెఱచిన రయము పోవు
పాపము'మ'యని మూసిన మరల రాదు
రామ తారక మంత్ర ధారణయె ముక్తి
సాధనమని తెల్సుకొనుటె సార్ధకమ్ము ॥

344.తే.గీ. మధురమైనది । రామ నామమ్ము । వినగ
మధురమైనది । రాము రూపమ్ము । కనగ
ఎన్నిమార్లు విన్నచదువ । నెన్ని సార్లు
వ్రాసిన । తనవి తీరదు రామ గాథ ॥



345. కం. భావావేశము లేదే
లేవే పదడాంబికములు లేశము కనగా
ఏవేళ భక్తి గలదే
రావే। యీరచన నీదె రామా కనవే ॥

346. సీ. నీలమేఘ శుభాంగ నీలోత్పలంబులు
ఇనవంశసోముడా యివిగొ గొనుము
కమలాక్ష నీకివె కమల శతంబులు
కోటి సూర్యసముడా కోరి గొనుము
ఆజానుబాహుడా అరవింద దళములు
ఆదర్శ పురుషుడా అందుకొనుము
నిఖిల జగంబుల నీరాజనంబులు
ఈశ హే పరమేశ యివిగొ గొనుము

తే.గీ. జీవిత రథ సారథివగు నీవె రామ।
జ్ఞాన మనుదివ్వె వెలిగి విజ్ఞాన పథమ
బట్టి ముక్తిని పొందంగ భక్తి నిమ్ము
కష్ట సుఖముల సమదృష్టి కలుగనిము

347. కం. ఇది శ్రీరామ కథా సుధ
మది ఘనముగ నిన్ను నమ్మి మంగళరీతి.
పదిలమ్ముగ రచియించితి
వదలకు నన్నెపుడు, రామభద్రా, దేవా !

348. భక్తితో నిను సేవించు శక్తి నిమ్ము
శుభకరా ! రామ ! ఈ కథా సుధకు వసుధ
కీర్తి నిమ్ము నీ 'కరుణ'యే స్ఫూర్తి మాకు
చింత లేక ఉందుము నీదు చింతనమున ॥